అపర్ణా గ్రంథమాల] [ద్వితీయ ప్రచురణము

ఓమ్

శ్రీమాత్రే నమః

# చంద్రాలోకము



అమరవాది నీలకంఠ సోమయాజి గారిచే

రచియింపఁ బడినది.

మొదటి కూర్పు 500 ప్రతులు





బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాశాలయందు

అయ్యంకి వేంకటరత్నము M. Sc. గారిచే ముద్రింపఁబడినది.

1944.

వెల రు 1—0—0.

# మహారాజపోషకులు

1. మ॥ రా॥ రా॥ శ్రీ శ్రీరాజా వెల్లంకి శ్రీనివాస జగన్నాథ రావు బహద్దరు జమీందారుగారు,
కాకర్ల యెస్టేటు, తిరువూరు,

2. ,, అయ్యదేవర రాజేశ్వరరావు ధోరవారు,
కొర్లపాడు, మధిరతాలూకా (నైజామ్)

3. ,, వారణాసి సదాశివరావుగారు,
తహశీల్దారు, అవనిగడ్డ,

4. ,, ఆయుర్వేద భూషణేత్యాది సకల బిరుదావళీ విరాజమానులగు బ్రహ్మశ్రీ పండిత నోరి రామశాస్త్రిగారు, బెజవాడ.

5. ,, చెరుకుపల్లి పట్టాభిరామయ్యగారు, B.A.
డిస్ట్రిక్టుకోర్టువకీలు, బెజవాడ.

6. ,, పబ్బతి హనుమంతరాయగుప్తగారు,
భూస్వాములు, వర్తకులు, చింతలపాడు,
నందిగామ.

7. ,, డా॥ జంధ్యాల దక్షిణామూర్తిగారు,
బెజవాడ.

8. ,, శిష్టా లక్ష్మీపతిశాస్త్రిగారు,
అగ్రహారీకులు, కనకవల్లి అగ్రహారం,

మ.రా.రా.శ్రీ శ్రీరాజా వెల్లంకి రాధా వేంకటకృష్ణారావు బహద్దరు
జమీందారుగారు, తిరువూరు

" " సత్యనారాయణరావు బహద్దరు జమీందారుగారు, తిరువూరు

" " పార్థసారథిరావు బహద్దరు జమీందారుగారు, తిరువూరు

" " సీతారామారావు బహద్దరు జమీందారుగారు, బెజవాడ

" " శ్రీరాజా గాడిచెర్ల వెంకట గోపాలకృష్ణారావు బహద్దరు
జమీందారుగారు, తిరువూరు

" వైకంటి నరసింహారావుగారు, బంజరుదారు, రామన్న పాలెం నైజాం

" అయ్యదేవర ధర్మారావుగారు, జమీందారు, గూడూరు నైజాం

" కాళ్ళూరి వెంకటప్పారావు ధొరవారు, గార్లవొడ్డు నైజాం

" కిషన్‌రావు ధొరవారు, రాజాపురం నైజాం

" సీతారామచంద్రరావుధొరవారు, అన్నపురెడ్డిపల్లి

" ఉమామహేశ్వరరావు ధొరవారు, గుండెప్రోడి నైజాం

" సర్. దేశముఖ్ దేశపాండ్యా కొండపల్లి గోపాలరావు ధొరవారు,
లింగనపేట, నైజాం

" " " కొండపల్లి రామచంద్రరావు ధొరగారు
బయ్యనగూడెం

" " " సోమరాజు రంగారావు ధొరవారు

" " " వీరి ధర్మపత్నులు సౌ॥ శ్రీమతి సోమరాజు
యిందుమతీదేవి ధొరసానిగారు, కవయిత్రి,
రుద్రాక్షపల్లె, నైజాం

మ.రా.రా.శ్రీ గురిజాల రామకిషన్‌రావుగారి కుమారుడు రామచంద్రరావు
ధొరవారు, బంజరుదారు, తల్లాడ నైజాం

" కానూరి వెంకట శివరావుగారు, విలేజిమున్సిఫ్, బెజవాడ

" మారేపల్లి అచ్యుతరామశాస్త్రిగారు, హెడ్డుగుమాస్తా,
D. P. W. office బెజవాడ.

" లంక నరసింహశాస్త్రిగారు, గుమాస్తా D. P. W. office
బెజవా

" మాదిరాజు నరసింహారావు పంతులుగారు, M. A., B. Ed
ప్రధానోపాధ్యాయులు, తాడంకి హైస్కూలు

" మాదిరాజు జగన్నాధరావు ధొరవారు, కందుకూరు

మ. రా. శ్రీ శాకరపర్తి భావనారాయణశాస్త్రిగారు, మర్చంటు, బెజవాడ
,, శిష్టా సీతారామస్వామిగారు, శానిటరీ యిన్‌స్పెక్టరు, బెజవాడ
శ్రీమాన్ కోర్లకొండ భట్టరు వేంకట నృసింహభట్టరు అయ్యవార్లంగారు, గోపవీడు
శ్రీయుత కన్నెకంటి శివరామకృష్ణశాస్త్రిగారు, గోపవీడు
,, కన్నెకంటి వెంకటాచలంగారు, B.E.,S. D.Officer హైదరాబాదు
,, సర్. దేశముఖ్ దేశపాండ్యా కొండపల్లి వాసుదేవరావుగారు, B. A. రేషనింగ్ ఆఫీసరు, నైజాం
,, పబ్బతి కేశవయ్యశ్రేష్ఠిగారు } భూస్వాములు చింతలపాడు
,, పబ్బతి రామకృష్ణమూర్తి శ్రేష్ఠిగారు } నందిగామ తాలూకా
,, దాసా రంగయ్య శ్రేష్ఠిగారు, భూస్వాములు జనరల్ మర్చెంటు
,, కంచి సీతారామయ్యగారు, తిరువూరు తిరువూరు
,, దూపకుంట్ల ముత్యమయ్యగారు, తిరువూరు
,, చతుర్వేదుల నాగభోగి శాస్త్రిగారు, తిరువూరు
,, కొల్లి బుచ్చయ్యగారు, భూస్వాములు, చిట్టేల
,, శ్రీరామనేని పార్థసారథి చౌదరిగారు భూస్వాములు, చింతలపాడు

---

## పండితాభిప్రాయములు

శ్రీశివాయ గురవే నమః

వైయాకరణభూషణేత్యాది బిరుదాంకితులును బెజవాడ సర్వతంత్ర స్వతంత్ర కళాశాలా ప్రధానాచార్యులును నగు

### బ్రహ్మశ్రీ తాడేపల్లి సాంబమూర్తిశాస్త్రిగారి యభిప్రాయము

కవితాసృష్టిని గీర్వాణవాణితో సాగించిన కయితగాండ్రలో నరసింహాదులు మున్నగు కొందఱే గొప్ప మెప్పొందఁదగిన కవిసార్వభౌములని పెద్దలు చెప్పుచుందురు. దానికిఁ గారణము వ్యర్థపదములులేక శాస్త్రీయవిషయములను శ్లోకములలో జొనుపుట యనన్యసామాన్యమగుటయే. ఇఁక నడుగడుగున ననేక నియమములతో నడుగుసాగించుటకు వీలులేని తెనుఁగు కవితలో శాస్త్రీయ విషయ ప్రతిపాదకమయ్యెఁ బండితపామరానంద సంధాయకమగు సహజభారతోఁ గలము నడిపిన తెలుఁగు కవులు పండితులునగు సమరవాది నీలకంఠ సోమయాజులుగా రాంధ్రదేశ

యుల జోహారు లందఁదగిన యాంధ్రవీరులు. ఈవిద్వత్కవిశేఖరులు విని పింపఁగా సంపూర్ణముగా శ్రవణానందముగా నీ చంద్రాలోకము విని యుంటిని. "సర్వదో మాధవః పాయాత్" యనుమన్నగు స్థలములలో వీరు చేసిన యనుకరణ మొకవిధమునఁ బద్యములు హృద్యములగుటకు రథ్య యైనది. గురు దేవ తాదాత్మ్యబుద్ధిదృష్టితో నొనర్చిన కృతిసమర్పణమునకు ననుకూలించునట్లు తుది యలంకారము (హేత్వలంకారము)నకు నుదాహరణ మిచ్చుచో నయ్యది ప్రకృత కృతిభర్తకు సమన్వయించునట్లు జయదేవకవి శ్లోకమును రచించుటయు, దానికి వీరు తెలుఁగుచేయుటయు నత్యాశ్చర్యకరము. ఈ సోమరాజులుగారు ప్రయత్నింపరేమోగాని యియ్యది విశ్వవిద్యాలయ పాఠ్యగ్రంథముగా నిర్ణయింపఁజేయుట యాంధ్రుఁడగువాని కావశ్యకమగు సంకల్పమగునని దాఁపక చెప్పు నా వాక్యములకు నందఱేకగ్రీవముగ నంగీకరింతురని విశ్వసించు విధేయుఁడు.

7—9—44 తాడేపల్లి సాంబమూర్తి శాస్త్రి.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

మహాశయాః!

సువిదితమేవేదం సర్వేషాం మనీషిణాం యద్రసజీవితస్య కావ్యశరీరస్య ఉపమాద్యలంకారాః భూషణప్రాయాః, నహ్యలంకారరహితం కావ్యం రమ్యభావమాపద్యతే; అలంకారాశ్చోపమాదిభేదేన నానావిధాః తే చాలంకారాః జయదేవకవినా చంద్రాలోకాఖ్యగ్రంథే లక్ష్యలక్షణశ్లోకాత్మకే సమ్యఙ్నిరూపితాః. తస్య చంద్రాలోకస్య చాంధ్రభాషాను వర్తనరూప మిమం గ్రంథ మమువాద్యుపాహ్వ శ్రీనీలకంఠసుధీభి రచిత మామూలచూడ మద్రాక్షమ్; గ్రంథశ్చాయం మూలస్యానూనానతిరిక్త తయా పరివర్తితః. తత్ర శ్లేషయమకోదాహరణేష్వపి క్లిష్టేష్వతిసమంజసం పరివర్తితః. ఏతేచ యజ్వానో న కేవలం కర్మఠా అపితు కాలజ్ఞతాయాం కీర్త్యా కులప్రతిష్ఠాయాం చాలంకారప్రజ్ఞతాయాం కృతిరచనాయాం సుపి జ్యేష్ఠతాం భజంతే.

అయంచ గ్రంథోఽలంకారగ్రహణకుతూహలినాం బాలానా మత్యంతోపకారాయ భవతీత్యత్ర న కాపి విప్రతిపత్తిః. తస్మాదస్య రాజకీయ పాఠశాలాసు విద్యార్థినామత్యంతోపయోగితయా త్తమకక్ష్యాసు పాఠ్యగ్రంథతయా ప్రవేశో భూయాదిత్యాశాస్మహే. విద్వజ్జనరమణీయతమమిమం గ్రంథం

విరచితవతాం శ్రీనీలకంఠయజ్వనాం లోకోపకారధురీణతా శ్లాఘ్యేత్యత్ర న కాప్యతిశయోక్తిః. శ్రీపరమేశ్వరశ్చైతాదృశలోకోపకారక గ్రంథరచనా ధురీణతా మితో౽ధికమేషాం శ్రీ నీలకంఠ యజ్వనామనుగృహ్ణాత్వితి శివమ్.

1-7-1944 — పయిడిమఱ్ఱి చంద్రశేఖరశాస్త్రి,
నేలకొండపల్లి. — శ్రీవిజయాపాతసంస్థాన విద్వాన్ ప్రకృత వసతిః

అలంకారమంజరి, కావ్యాత్మ, మున్నగు గ్రంథములను రచించి సుప్రసిద్ధ కవులు, పండితులును, బెజవాడ S. K. V. V. హైస్కూలు ప్రాంచి ప్రధానోపాధ్యాయులు నగు

## బ్రహ్మశ్రీ శ్రీమాన్ శే. వేం. రాఘవయ్యంగార్ M. A. గారి
## అభిప్రాయము

బ్రహ్మశ్రీ అమరవాది నీలకంఠ సోమయాజిగారిని గాంచినంతనే చూపరులకు ప్రాచీప్రతీచీ సంగమము స్మృతిపథమున గోచరించును. వీరి పేరునంగల అమరవాది, సోమయాజి శబ్దములేగాక, వీరి రచనలు, అందును ఆంధ్రీకృత చంద్రాలోకము వీరి గీర్వాణవాణీ పరిమళమును ప్రకటించును. శ్రీకన్యకా పరమేశ్వరీ హైందవోన్నత పాఠశాలలో స్కూలుఫైనలు పరీక్షవఱకు చదువుటయే వీరి ఆంగ్లసాహిత్య సౌరభమును వెదచల్లును. కావున వీరియందు ప్రాచీప్రతీచీ సంగమము కలదనిన చో స్వభావోక్తి చెల్లును. ఇంతియేగాక వీరికిగల మంత్రశాస్త్ర జ్యోతిషశాస్త్రముల యందలి జ్ఞానము మాదృశుల వర్ణనమునకు మేరమీరు నినచో అతిశయోక్తి గాదు. వీరి చారిత్రిక విషయమును చదువరుల విభావనా విశేషమునకు వదలి ప్రస్తుత గ్రంథమును పరిశీలింతము.

జయదేవుని చంద్రాలోకము వీరి అనువాదమునకు మాతృక. భరతునిచే పేర్కొనబడిన ఉపమా, రూపక, దీపకము లను అర్థాలంకార త్రయము జయదేవుని కాలమునకు "శతమానం భవతి" అనినట్లు నూరు అలంకారము లయ్యెను. ఈనూటికిని "బాలానామవగాహనసిద్ధయే" అను ప్రతినతో జయదేవుడు లక్ష్యలక్షణముల రచించెను. తరువాత అప్పయ దీక్షితుడు 'కువలయానందము'ను చంద్రాలోకమునకు వివరణ గ్రంథముగ నిర్మించెను. ఈ చంద్రాలోకమునకు ఉత్తర హిందూస్థాన, దక్షిణ హిందూ

స్థాన పాఠములుగలవు. వీని రెంటికిని అలంకారముల సంఖ్యాక్రమమున భేదములు గలవు. వానిని చదువరులు వేరొకచో తిలకింతురు.

శ్రీసోమయాజులుగారు దీక్షితుని గ్రంథమునందలి కారికలను మాత్రమె స్వీకరించి వారి రచనను సాగించిరి. అమరవాదులు విద్యార్థి బృందారక బృందమునకు దీనిని ప్రసాదింపనెంచి, తేటశైలిని, సుగమముగ ఆంధ్రీకరించిరి. వీరి అనువాదము 'శబ్దంబుననుసరించి, అర్థంబుగుర్తించి, అలంకారంబు భూషించి' తెలుగించుచున్నదనినచో విశేషోక్తిగా నేరదు. కొన్నిచోట్టుల అలంకారములయొక్క లక్షణమును సుబోధకము గావింపనెంచి వ్రాసిరి. మరికొన్ని పట్టుల స్వతంత్రలక్ష్యముల నొసంగి తమ రచనల ప్రకాశింపజేసిరి వేరొక కొన్ని తావుల దీక్షితజయదేవుల పుస్తకములలోని విషయమును సేకరించి, అలంకారశాస్త్రము ననాయాసముగ నభ్యసింప నభిలషించు బాలురకు విందుగావించిరి.

ఉత్ప్రేక్ష, నిదర్శన, వ్యతిరేక, శ్లేష, వికస్వర, ప్రౌఢోక్తి, ఉల్లాస, లేశ, ముద్ర, పూర్వరూప, విశేష, వక్రోక్తి కారణమాలా అలంకారముల యొక్క లక్షణమును చదువరులకు సుబోధకమగునటుల వివరించిరి. ఆవృత్తి దీపక, శ్లేష, చిత్రోత్తర, వక్రోక్తి మొదలగు అలంకారముల లక్ష్యము మాతృకానుసారముగ శబ్దంబుననుసరించి వెలుంగుచున్నవి.

దృష్టాంత, నిదర్శన, వ్యతిరేక, శ్లేష, ప్రౌఢోక్తి, అవజ్ఞ, చిత్రోత్తర, వక్రోక్తి, ప్రభృతి అలంకారముల లక్ష్యములు స్వతంత్రములై వెలుంగుచున్నవి.

అందుచే నీచంద్రాలోకము స్కూలుఫైనలు, ఇంటరు తరగతుల బాలబాలికలకు చాల మేలు గూర్చునని చెప్పనొప్పును. ఆయా తరగతులకు దీనిని పాఠ్యపుస్తకముగ విద్యాధికారులు నియమించి గ్రంథకర్తను ప్రోత్సహింతురు గాక!

7—7—44. శే. వేం. రాఘవఅయ్యంగారు, M. A

శ్రీ మత్పరదేవతాయై నమః

బ్రహ్మశ్రీ అమరవాది నీలకంఠసోమయాజులుగారిచే రచియింపబడిన చంద్రాలోకము నే నామూలచూడముగ దిలకించితిని. ఈకవిశిరోమణి యద్వితీయుండు. వేదము వచ్చి, శాస్త్రము తెలిసి, జన్నమొనర్చి, ఆంగ్లభాష నారితేరి, సిద్ధాంత

మఁ జవిచూచి, మాంత్రికంబు మననంబుచేసి, నిశ్చలాత్ముఁడై, వైదిక లౌకిక ప్రజ్ఞలం దారితేరి. పాఠక లేఖక మార్గంబులన్నియుం దిలకించి, బహుగ్రంథములు తఱచిన నవనీతంబువోలె ననేక గ్రంథరాజంబులు చేసి కవిగండమై, యలంకారలక్షణ రహస్యంబు లన్నియు నన్వే షించి, తత్సారభూతంబుగ నీ చంద్రాలోకంబును సార్థకరూపం బొనర్చి తెనిఁగించి చరితార్థుండయ్యె. ఈయన సత్యప్రవర్తనమును గురించి యొక్కింత యుదాహరింతును. ఈచంద్రాలోకమునంతయుం దెలిఁగించి "మఇచ్ఛ మానం, డివం ప్రాప్తమంచవంగ, నేహానద్దీ హరాన్తికే యాహియన్నియె" అను నొకయనుకరణమును జేసి(92అ. 86పే. వక్రోక్త్యలంకారము)"యాంధ్రీకర ణము వుదరమిచే నిట్లుగ వ్రాయవలసి వచ్చినది." అని స్వయముగ నిపతించి యున్నవాఁడు. ఈరచనయనన్యసాధారణము. చిన్నిగీతములలోఁ దేటతెలుఁగు పదములలో భావోద్రేకములైన యలంకార రహస్యములు, సుసులభశైలిని, విశదీకరించుట మిక్కిలి దుర్ఘటమైన కార్యము. సంస్కృతాంధ్రములలో సమానప్రజ్ఞ యుండినంగాక యిట్టి రచన పొసంగదు. ఈ గ్రంథము పేరునుబట్టియును నాచంద్రస్థాయిగ విజయంబుగొని పాఠకులకు జ్ఞానోప దేశము నొసంగుచుండునుగాక!

విద్వాన్. భమిటిపాటి అయ్యప్పశాస్త్రి, శతావధాని,
రిటైర్డు సీనియర్ పండిట్, బోర్డుహైస్కూలు. (కృష్ణా)

# విజ్ఞాపన

సహృదయులగు పండితవర్యులు నా యీ గ్రంథము నామూలాగ్ర ముగ పరిశీలించి విమర్శించి, యిందేమైన దోషములున్నచో నాకుఁ దెలిపి నచో వానిని ద్వితీయ ముద్రణమున సవరింపఁగొనెదను. శ్రద్ధతో పరిశీలించి చదివి యభిప్రాయము లొసంగిన పండితులకున్ను, నా గ్రంథము నామూల చూడముగ చదివి విమర్శించిన వ్యాకరణ శిరోమణీత్యాది బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ కంభంపాటి రామమూర్తిశాస్త్రిగారికిని, సాహిత్యశిరోమణీ త్యాది బిరుదాంకితులగు జంధ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారికిని నమస్కారము లర్పించుచున్నాను. నా ప్రార్థనను త్రోసిపుచ్చక వృద్ధు లయ్యును శ్రమకోర్చి గ్రంథమంతయు పరిశీలించి విమర్శించుటయేగాక నాకోరికను నెరవేర్చి కృతిని గ్రహించినందులకు మద్గురువరేణ్యుల పాదార విందములకును నమస్కరించుచున్నాను. గ్రంథకర్త.

శ్రియై నమః

# చంద్రాలోకస్థాలంకారానుక్రమణికా.



గ్రంథకర్త:

బ్రహ్మశ్రీ అమరవాది నీలకంఠయజ్వ

శ్రీమత్పరదేవతాయై నమః

# తొలిపలుకు

## ఆన్ధ్రచంద్రాలోకము

ఈ చిన్నిపొత్తమును మచ్ఛిష్యుఁడు యజ్ఞకర్త సంస్కృతాంధ్ర భాషలయందుఁ గవియును నగు శ్రీ॥ చి॥ అమరవాది నీలకంఠయజ్వ యాంధ్రీకరించి నాయొద్దకుఁ దెచ్చి ప్రత్యక్షరమును వినిచెను. చాల వృద్ధుఁడనై యున్న నేను విని సంస్కరించితిని. కాని "వృద్ధుల బుద్ధులు సంచలించు" ననుకతన నెక్కడనేని యింకను నీహారలేశములు మిగిలి యుండునేమో? యనుకొనుచున్నాఁడను. అసలీతనిరచనలో నేను సంస్కరించిన యంశములు కూడ నీహారలేశములే. ఇతనికిఁ గవి కుండవలసిన సామగ్రి సమగ్రముగనే యుంటంజేసి యొరులు సంస్కరింప వలసిన యావశ్యకత లేనే లేదు. అయినను నాకును నీతనికిని గల శైష్యోపాధ్యాయిక నాకడకు రప్పించినది. ఈ రప్పించుటకుఁ గారణ మిదియును గాదు. దీని నితఁడు నాకుఁ గృతి నొసంగనెంచి ఫలపుష్ప తాంబూలాంబ రాదులతోడను, నూత్నార్ఘ్య పారిబర్హ్యముతోడను దెచ్చి యీ కృతికన్యకను 74 వత్సరముల ప్రాయముగల నాకుఁ, బదియేడులపై నాలు గేండ్లుమాత్రమే గల బాలునిగా నపోహపడి సమర్పించె. నేనును మనఃపూర్వకముగా స్వీకరించితి. తెలుఁగొనర్చుటకు నెవ్వరికిని శక్యముకాని జతుకాష్ఠశ్లేషలు (మ॥ "జతుకాష్ఠక్రియ నొప్పు సంస్కృతపుశ్లేషల్ తెల్గులో మార్చ మా, మతికిన్ . . .

ప్రమాణంబుల్ తదుద్గ్రంథముల్'' (శ్రీనివాస విలాసపీఠిక చూ) తప్పఁ దక్కినవి యేవియు విడువక తెలిఁగించెను. చదువరులు గుణ గ్రహణ తత్పరులు పరికింపఁగలరు. యూనివర్సిటీ పరీక్షుల కుప యోగించుట కలంకార శాస్త్రగ్రంథము లిప్పుడిప్పుడే తెలుఁగు లోనికిఁ గొండ అనువదింప మొదలిడిరి. వారిలో నీతఁడొకఁడు. విద్యాశాఖాధికారు లీతని పరిశ్రమను గమనింతురని నావిశ్వా సము. ఇతఁడు నాకు శిష్యుఁడగుటచేతను, దీనిని నాకేకృతినిచ్చుట చేతను, అంతతో సరిపెట్టక కట్నముకూడ నిచ్చియుంట చేతను నే నేమి వ్రాసినను దాని నసూయాగ్రస్తులు కడుంగడు నులు వుగా నపవదింతు రనుభయము వెనుదీయఁ జేయుటచే మఱి కొన్ని విశేషములు వ్రాయవలసియున్నను వ్రాయక యిత నికి మదుపాస్యదేవత కామేశ్వరి యితోఽధికంబగు సద్బుద్ధియు యశంబును నిరామయాయురారోగ్య భాగ్యంబులును బ్రసాదించి యిట్టులే మఱికొన్ని విద్యార్థుల కుపకరించు గ్రంథము లితనిచే రచింపఁజేసి యనుగ్రహించుఁ గాక యని మనః పూర్తిగా నాశీర్వదించు చున్నాఁడను. శ్లో॥ కవిః కరోతి కావ్యాని, లాలయ త్యుత్తమో జనః; తరుః ప్రసూతే పుష్పాణి; మరు ద్వహతి సౌరభమ్; ॥ఇతిశివమ్॥

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, శతావధాని,
క్షీరసాగరం, బెజవాడ, కృష్ణాజిల్లా.





శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు.

ఓం

శ్రీమాత్రే నమః

శ్రీమత్పరదేవతాయై నమః

శుభమస్తు అవిఘ్నమస్తు

మద్గురువరేణ్యులగు

కళా ప్రపూర్ణేత్యాద్యనేక బిరుదావళీ విరాజమానులగు

బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి శతావధానిగారికి

# కృతి సమర్పణము



మ. మును నేఁ జేసిన భారతంబుఁ గృతిగా భూమన్యరూపంబు మా
జననీరత్నము శ్రీనిధానమగు చంచద్రాజ రాజేశ్వరీ
ఘనపాదంబులకే నొసంగితిని నీకబ్బంబు మీ కర్పణం
బుగ జేతున్ గురువర్య! వేంకటకవీ! స్ఫూర్జద్యశో భార్గవీ!

చ. మనుజులకిచ్చి సత్కృతుల మాన్యములన్ గడియించుకోర్కె నా
మనమున లేదు నే దురభిమానముచే వచియింపఁ జిద్రనం
బనయము ధ్యేయమంచు మదినారయుచుండు టెనాయభీష్టమై
ననుగురుదేవతార్పణము న్యాయపథంబని తోఁచి యిచ్చితిన్.

గీ. మీకుఁ గృతి నిచ్చు యోగ్యత నాకు లేదు
శిష్యుఁడను గాన నే సాహసించినాఁడఁ
జనవుచే నన్ను మన్నించి సత్కృపార్ద్ర
చిత్తమున దీని గురుదేవ! స్వీకరింపు.

ఉ. ఈశుఁడు పూజఁ జేయును రమేశుని మానసమందు నెప్డు నే
నీశుఁడఁ బేరుచేతను రమేశుఁడ వన్నిట వన్నె దెత్తు వం
చాశ జనించెఁ జుట్టఱిక మందఁగఁ గాదనకే గ్రహింపు మీ
పేశలగాత్రి నీ కగుతఁ బ్రీతికిఁ బాత్రమలం కృతాంగినై.

ఉ. కష్టముఁ బెట్టదెన్నఁడును గన్నె యలంకృతు లేని పెట్టితిన్
శిష్టునిబిడ్డ మీరును విశిష్టకవిత్వ బుధాగ్రగణ్యు లం
కిష్టము వచ్చురీతిని గ్రహించి సుసేవల నందుఁడయ్యా? సం
తుష్టికి మేరయున్నె? పరితోషముతో గ్రహియింపుఁడీకృతిన్

ఉ. కన్నియనిచ్చి కట్నమొసగం దగునంతటి గేస్తుఁగాను, నా
కున్న సిరిన్ గణించి యెదియో యిడినంతకె సంతసించి కై
కొన్న జగంబు మెచ్చు నిది కోవిదసమ్మత మిప్పుడేరొ సం
పన్నులు పోవు త్రోవలు సమంజసమెట్లగు బీదగేస్తుకున్.



వివరణము:—ఇచ్చట, కీర్తి యుపమేయము, హంసి యుపమానము. ఈ రెంటికిని స్వర్గంగావగాహనము సమాన ధర్మము, "వలె" వాచకము. ఉపమాలంకారము రెండు విధములు. పూర్ణోపమ యనియు, లుప్తోపమ యనియు, ఉపమానము, ఉపమేయము, సాధారణధర్మము, ఉపమావాచకము, గలిగి యున్నయెడలఁ బూర్ణోపమ యగును. ఇందేది లోపించినను లుప్తోపమ యగును.

లుప్తోపమాలంకారః

శ్లో॥ వర్ణ్యోపమాన ధర్మాణా ముపమా వాచకస్యచ,
ఏక ద్వి త్ర్యను పా దానా ద్భిన్నా లుప్తోమాష్టధా.

గీ॥ వర్ణ్య ముపమానము, నుపమావాచకంబు
ధర్మము నను నాల్గింటిలోఁ దనర నొకటి
గాని రెండైన మూఁడైనఁగాని విడువ
నెన్మిది విధాల నీ యలంకృతి రహించు.

1. వాచకలుప్తా, 2. ధర్మలుప్తా, 3. ధర్మవాచకలుప్తా, 4. వాచకోపమేయలుప్తా, 5. ఉపమానలుప్తా, 6. వాచకోపమానలుప్తా, 7. ధర్మోపమానలుప్తా, 8. ధర్మోపమానవాచకలుప్తా.

శ్లో॥ తటిద్గౌరీ న్దు తుల్యాస్యా కర్పూర న్తీ దృశోర్మమ
కాన్త్యా స్మరవధూయ న్తీ దృష్టా తన్వీ రహో మయా.

గీ॥ అది తటిద్గౌరి, యిందు తుల్యాస్య యగును
నరయఁ "జందనింతి స్మరవధూయంతి కాంతి"
నట్టి యింతిని నేను రహస్య మందుఁ
గాంచినాఁడను గన్నుల కలవుదీఱ.

శ్లో॥ యత్తయా మేళనం తత్ర లాభో మే యచ్చ తద్రతేః
తదేతత్కాకతాళీయ మవితర్కిత సంభవమ్.

గీ॥ దానితో మేళగింపును దాని రతియుఁ
గాకతాళీయముగ నాకుఁ గానుపించు
నట్లు చేకూరునని నే మదాత్మయందు
స్వప్నమున నైనఁ దలఁచిన వాఁడఁగాను.

వివరణము:—1. తటిదివ గౌరీ యను నెడ 'నివ' శబ్దము (ఉపమా వాచకము) లోపించుటచే నిది వాచకలుప్త కుదాహరణము. 2. ఇన్దు తుల్యాస్య యనుచోట "ఇన్దు" (చంద్రుఁడు) ఉపమానము. "తుల్య" వాచకము. "ఆస్య" ఉపమేయము. ఇట సాధారణ ధర్మమును బోధించు పదము లేదు గావున ధర్మలుప్త. 3. "చంద్రింతి" యనుచోట చంద్రశబ్దము కర్పూర వాచకము. వాచకమును ధర్మమును లోపించినవి. "చంద్ర" యను నుపమానము, నుపమేయమును గలవు. ('ఇంతి' యనునది యుపమేయము) కావున ధర్మవాచకలుప్త. 4. కాంతి యనునది ధర్మము. "స్మరవధువు" ఉపమానము. ఇందు నుపమావాచకమును, తన్వి అను ఉపమేయమును ఈ రెండును లోపించుటచే నిది వాచకోపమేయలుప్త. 5. కాకతాళీయ మనుచోట, "కాక, తాళ" అను పదములు రెండు గలవు. ఇచ్చట లక్షణాబోధితములగు కాకాగమనము, తాళపతనము- ఇయ్యవి రెండును గలిసి ఉపమానము. అట్టి యుపమానమును, నుపమావాచకముగు 'ఇవ' యనునదియు లోపించుటచే నియ్యది వాచకోపమానలుప్త. 6. "కాకతాళీయ" మను చోట 'ఛ' ప్రత్యయము "సమాసాచ్చ తద్విషయాత్" అను

సమానార్థకములు. ఉపమేయము, విషయము-వర్ణ్యము, ఇవియు సమానార్థకములే. ఉపమానము సదృశవస్తువు. ఉపమేయము వర్ణింపఁ దలఁచిన వస్తువు. పర్యాయమున నుపమానము నుపమేయముగను, నుపమేయము నుపమానముగను వర్ణించుట.

ప్రతీపాలంకారః, తద్భేదాః 4

శ్లో॥ ప్రతీప ముపమానస్యోపమేయత్వ ప్రకల్పనమ్
త్వల్లోచన సమం పద్మం త్వద్వక్త్ర సదృశో విధుః ౧

గీ॥ మఱి ప్రతీపమా నని రుపమానమున, కొ
నరఁగ నుపమేయతను గల్పనం బొనర్పఁ
బడఁతి! నీ లోచన సమంబు పంకజంబు;
నీదు మొగమున కెనయగు నెల నెలంత!

వివరణము:— ఉపమాలంకారమును దలక్రిందుఁ జేసిన యెడలఁ బ్రతీప మగును. ఇందులో నుపమానములగు పద్మములను జంద్రుని నుపమేయములుగఁ జేసి కన్నులను, మొగమును నుపమాన వస్తువులుగ వర్ణించిరి గానఁ బ్రతీపాలంకారము. ఇది యైదు విధములు.

శ్లో॥ అన్యోపమేయలాభేన వర్ణ్యస్యానాదరశ్చ తత్
అలం గర్వేణ తే వక్త్ర కాన్త్యా చన్ద్రో భవాదృశః ౨

గీ॥ అవని; నుపమానము నుపమేయముగ సంగ్ర
హించి ప్రకృతోపమేయంబు నేవగింప
నన్యమా ప్రతీపంబు; భవాదృశుండు
చంద్రుఁ డున్నవాఁ డాస్యమా! చాలుఁ బొగరు.

శ్లో॥ వర్ణ్యోపమేయ లాభేన తథాన్య స్యాప్యనాదరః
కః కౌర్యదర్పస్తే మృత్యో త్వత్తుల్యా స్సన్తిహి స్త్రియః 3

గీ॥ వర్ణ్యమా నుపమేయ లాభంబుచే న
వర్ణ్యమా నుపమానముఁ బరిహసింప
నది తృతీయమాఁ గౌర్యగర్వాప్తి యేల?
మృత్యువా! నీ సమానులౌ మెలఁత లుండ

శ్లో॥ వర్ణేనాన్య స్యోపమాయా అనిష్పత్తి వచశ్చ తత్
ముధాపవాదో ముగ్ధాక్షి త్వన్ముఖాభం కిలామ్బుజమ్. ౪

గీ॥ పరగ నుపమానమగు నన్యవస్తువునకుఁ
గలుగు నుపమితియొక్క భంగమును వర్ణ్య
మున వచింపఁ బ్రతీపమౌ ననిరి కృతుల
తమ్మి! నీ మోము సమమంట తథ్య మగునె?

శ్లో॥ ప్రతీప ముపమానస్య కైమర్థ్య మపి మన్వతే
దృష్టంచే ద్వదనం తస్యాః కిం పద్మేన కి మిన్దునా? ౫

గీ॥ వర్ణ్యమువలన నిష్టాప్తి వఱలఁగ నుప
మాన మెందుకనఁ? బ్రతీపమ యగు నందు
చేడెమొగముఁ జూచుట తటస్థించెనేని
అబ్జ మేటికి? శశి యేటి? కనితలంతు.

రూపకాలంకారః, తద్భేదాః 5

శ్లో॥ విషయ్యభేద తాద్రూప్య రంజనం విషయస్య యత్
రూపకం తత్త్రిధాధిక్య న్యూన త్వానుభయోక్తిభిః. ౧

గీ॥ విషయి తాద్రూప్యమునఁ దదభేదమునను
రంజనము విషయమునకు రంజిలు నెడ,

5. న్యూనాభేదరూపకము, 6. అనుభయాభేదరూపకము. ఉప మేయమున కుపమానముయొక్క యభేదముచేతను, తాదాత్మ్యముచేతను రంజనము (అనఁగాఁ బూఁతఁబూయుట) రూపకాలంకారము. ముఖాదు లుపమేయములు; పద్మాదు లుపమానములు. తాదాత్మ్య మనఁగాఁ, దదాకారత్వము నాపాదించుట; రంజనమనఁగాఁ బ్రకాశనము. ఉపమానముయొక్క తాదాత్మ్యముచేత నుపమేయమునకు, నుపమానముయొక్క రంజన మనఁగా నుపమానత్వము కలిగెనేని రూపకాలంకారమగును. ఎవఁడు క్షణములో శత్రుపురముల భస్మీభూతముఁ జేసెనో? అను నుదాహరణములో నుపమేయము రాజు, ఉపమానము శివుఁడు. రాజునకు శివునకు, నభేదము వర్ణింపఁబడినది. అనఁగా శివునకు రాజునకు, నభేదము వర్ణించుటచే రాజు శివుఁడే యని రాజునకు శివత్వ మభివర్ణితమైనది. కావున రూపకాలంకారము. ఈ రూపక, మభేదరూపకాలంకారము అగుచో నీ యుదాహరణములో రాజునకు శివునికంటె న్యూనత గాని, యాధిక్యముగాని చెప్పఁబడలేదు. కావున నిది అనుభయాభేదరూపకము.

2. "ఈ మహారాజు మూఁడవ యీక్షణంబులేని తరుణేందుశేఖరుఁడు" అను నీ యుదాహరణములో రాజునకు శివునకు నభేదమును జెప్పుచు మూఁడవ కన్ను లేకుండుట యను లోపము వచింపఁబడినది గావున న్యూనాభేద రూపకాలంకారము. న్యూనత్వ మభేదమును దృఢపఱచుచున్నది.

3. "విభుఁడు సమమైనదృష్టిని స్వీకరించి, భూవలయ మేలుచున్నట్టి భూతపతియ" అను నుదాహరణములో శివుఁడు

త్రినేత్రుఁడు కావున విషమదృష్టి గలవాఁడు. రాజునకు సమమైన దృష్టిగలదు. సమమైన దృష్టిచే విశ్వ మేలుచున్న శివుఁడనుటవలన, రాజునకు శివునకు నభేద మాపాదింపఁబడినను, శివునకులేని సమదృష్టి రాజునందు వర్ణించుటచే, రాజునం దాధిక్యమును సూచించుటచే నధికాభేదరూపకాలంకారము.

4. "ఈపె ముఖచంద్రుఁ డానంద మిచ్చుచుండ, నక్షి కున్నదె శశిఁగను నవసరమ్ము" అను నుదాహరణములోఁ జంద్రునకును, ముఖచంద్రునకును దాదాత్మ్యము వర్ణింపఁబడినది. ఇందు న్యూనతనుగాని, యధికత్వమునుగాని వర్ణింపలేదు. కావుననను భయ తాదాత్మ్యరూపకాలంకారమని యెఱుఁగనగు.

5. "ఈ లతాంగి వార్ధిని జనియింపని సిరి" అను నుదాహరణములో, లక్ష్మి పాలసముద్రమునం దుద్భవించినది. ప్రకృతోపమేయమగు స్త్రీ, వార్ధిని జనింపకుండుట న్యూనత. నిజమయిన సిరికంటెఁ బాలసముద్రమునఁ బుట్టకుండుట యను న్యూనత్వ మాపాదించి వర్ణించుటచే నియ్యది న్యూన తాదాత్మ్య రూపకాలంకార మనఁదగును.

6. "అందకత్తియ నెమ్మోము చందమామ, మచ్చతో నున్న యీ చందమామఁ గేరు". ఇట చంద్రునియందు మచ్చ యుండుట లోపము. తక్కిన లక్షణములయం దన్నిట నీపె ముఖచంద్రుఁడు తాదాత్మ్యమును బొందెనుగాని, మచ్చ యీపె ముఖచంద్రునియందు లేకుండుటచేతఁ గళంకసహితుఁడగు నిజమైన చంద్రుని నీపె ముఖచంద్రుఁ డతిశయించుచున్నాఁడని వర్ణించుటచేత నధిక తాదాత్మ్య రూపకాలంకార మని చెప్పఁదగును.

### పరిణామాలంకారః 6.

శ్లో॥ పరిణామః క్రియార్థశ్చే ద్విషయీ విషయాత్మనా
ప్రసన్నేన దృగబ్జేన వీక్షతే మదిరేక్షణా

గీ. విషయతాదాత్మ్యమును జెంది విషయి, ప్రకృత
మున కుపకరింపఁ; బరిణామము చెలువారు;
సకియ నిర్మలమగు దృగబ్జమునఁ బ్రాణ
నాథుఁ జూచుచునుండె విన్నాణముగను.

వివరణము:—ఇచ్చట విషయి, విషయతా పరిణామమును జెంది క్రియావిశిష్టమై యున్నది. కావునఁ బరిణామాలంకారము. అంబుజము విషయి, నేత్రము విషయము పై లక్ష్యమునఁజూచునది యంబుజముగాని నేత్రముకాదు. అంబుజమునకు స్వయముగాఁ జూచుశక్తిలేక నేత్రముగాఁ బరిణమించి చూచిన దనవలెను. అందుచేతఁ బరిణామాలంకారము.

### ఉల్లేఖాలంకారః 7.

శ్లో॥ బహుభి ర్బహు ధోల్లేఖా దేకస్యో ల్లేఖ ఇష్యతే
స్త్రీభిఃకామోర్థిభి స్స్వర్ద్రుః కాలశ్శత్రుభి రైషిసః

గీ॥ పెక్కు రొక్కనిఁ గీర్తింపఁ బెక్కువిధుల
నద్ది యుల్లేఖ మగు నటంచనిరి కృతుల
కామునిగ స్త్రీలు, యాచకు ల్కల్పకముఁగఁ
బరులు యమునిఁగ నాతేనిఁ బలుకుచుంద్రు.

శ్లో॥ ఏకేన బహుధో ల్లేఖేప్యసా విషయభేదతః
గురు ర్వచ స్యర్జు నోయం కీర్తౌ భీష్మ శ్శరాసనే.

గీ॥ విషయభేదమ్మునంజేసి వివిధ గతుల
నొకఁ డొకనిఁ జెప్ప నుల్లేఖ మొప్పుఁ గృతుల
ధనువునందు భీష్ముండు, వాక్కునను గురువు,
నర్జునుండగు గీర్తిని నరయ జేడు.

వివరణము:—ఇయ్యెడ రెండు విధములగు నుల్లేఖము లకును గల భేదము విస్పష్టముగాన వివరణ మనావశ్యకము.

స్మృతి:— భ్రాన్తి సన్దేహాలఙ్కారాణి 8-9-10

శ్లో॥ స్యాత్ స్మృతిభ్రాన్తి సన్దేహై స్తదం కాలం కృతిత్రియమ్
పఙ్కజం పశ్యతః కాంతా ముఖం మే గాహతే మనః

గీ॥ విషయిచే విషయస్మృతి వెలయునేని
స్మృతి మదాఖ్య నలంకృతి చెలఁగు నందు
పంకజముఁ జూచినంతన భావ మలరి
భామ మొగమును స్మరియించి ప్రమదమందు.

శ్లో॥ అయం ప్రమత్త మధుప స్త్వన్ముఖం వేత్తి పఙ్కజం
పఙ్కజం వా సుధాంశు ర్వే త్యస్మాకం తు న నిర్ణయః

గీ॥ ఒక్కదానిని భ్రాంతి వేఱొక్కవస్తు
వుగఁ దలంప భ్రాంతి మ దభిధగ నెసంగు
నీ మదించిన తుమ్మెద యిందువదన!
తమ్మియని నీదు మోమునుఁ దలఁచి వ్రాలె.

గీ॥ అదియొ! యిదియొ! యనెడి శంక యుదయ మంద
నొకటిగను నష్టు, సందేహ మొప్పుచుండు
పద్మమే యగునో! లేక పద్మవైరి
యగునో! నిర్ణయింపంగలే నైతి మోము.

## ౧. అపహ్నవాలంకారః, తద్భేదాః ॥

శ్లో॥ శుద్ధాపహ్నుతి రన్య స్యారోపార్థో ధర్మ నిహ్నవః
నాయం సుధాంశుః కిం తర్హి వ్యోమగంగాసరోరుహమ్.

గీ॥ విషయియెడఁ గల్గు ధర్మంబు; విషయమందుఁ
గల్పనముకొఱ కుపమేయ కలితధర్మ
మును మఱుఁగుఁ జేయ, సత్కవు లనిరి కృతుల
శుద్ధ మా నపహ్నుతిగఁ బ్రసిద్ధరీతి.

గీ॥ ఇట్టి సుందరబింబంబు నెవ్వరందు?
చంద్రుఁడంచుఁ దలంతువా! సకియ మిన్న !!
ఇతఁడు చంద్రుండు గాఁడు- మఱేమటన్న?
వ్యోమగంగను బుట్టిన తామరసము.

వివరణము:—వర్ణనీయవస్తువు చంద్రుఁడు. ఇతని యందలి చంద్రత్వ మపహ్నవింపఁబడి (కప్పఁబడి) వ్యోమ గంగా సరోరుహత్వ మారోపింపఁబడినది. కావున నిది శుద్ధా పహ్నుతి.

## ౨. హేత్వపహ్నవాలంకారః

శ్లో॥ స ఏవయుక్తి పూర్వశ్చే దుచ్యతే హేత్వపహ్నుతిః
నేన్దు స్తీవ్రో న నిశ్యర్కస్సిన్ధోరౌర్వోయ ముత్థితః.

గీ॥ శుద్ధ మా నపహ్నుతి యుక్తి సిద్ధ మగుచు
నొప్పుచుండిన హేత్వపహ్నుతి యటందు
శశియొ ! కాఁడు తీవ్రుఁ, డినుఁడొ? నిశిగద! యిది
కాన బడబాగ్నియే సముద్రాన నిగిడె.

వివరణము:—చంద్రునియందు బడబానలత్వ మారో

పించుటకై ప్రథమమున యుక్తిపూర్వముగ కొన్ని ధర్మముల నపహ్నవించి యనంతరమున బడబానలత్వ మారోపించు టచే హేత్వపహ్నవాలంకారము.

## ౩. పర్యస్తాపహ్నవాలంకారః

శ్లో॥ అన్యత్ర తస్యారోపార్థః పర్యస్తాపహ్నుతి స్తు సః
నాయం సుధాంశుః కిం తర్హి సుధాంశుః ప్రేయసీముఖమ్.

గీ॥ వర్ణ్యమం దన్యధర్మముంపఁగను, దద్గ
తంబు ధర్మంబును నపహ్నుత మొనరింప
వఱలు పర్యస్త పూర్వకాపహ్నవంబు
శశి యితఁడు కాఁడు, చానయాస్యం బదె శశి.

వివరణము:—ప్రకృత వర్ణ్యము ముఖము; చంద్రుఁడు వర్ణ్యము కాదు. ముఖమునందుఁ జంద్రత్వము నారోపించుటకై చంద్రునియందు న్యాయమైన చంద్రత్వము లేదని యపహ్నవించుటవలన నిది పర్యస్తాపహ్నవాలంకారము.

## ౪. భ్రాన్తాపహ్నవాలంకారః

శ్లో॥ భ్రాన్తాపహ్నుతి రన్యస్య శంకాయాం భ్రాంతివారణే
తాపం కరోతి సోత్కంపం జ్వరః కిం న సఖిస్మరః

గీ॥ జనుఁడు శంకించునప్డు నిజంబుఁ బల్కి
భ్రాంతిఁ బోఁద్రోలఁగను భ్రాన్త్యపహ్నుతియగు
కలుగుచుండెఁ దాపంబు సోత్కంపముగను
జ్వర మొకో? కాదు సకియరో! మరుఁడె నమ్ము.

## ౫. ఛేకాపహ్నవాలంకారః

శ్లో॥ ఛేకాపహ్నుతి రన్యస్య శఙ్కాతస్తథ్యనిహ్నవే
ప్రజల్ప న్మత్పదే లగ్నః కాన్తః కిం న హి నూపురః

గీ॥ పరులు శంకింప, నిజము గోపనముఁ జేసి
యనృత మాడ ఛేకాపహ్నుతి నెగడెడిని
జల్పన మొనర్చుచుండె మచ్చరణమందుఁ
బ్రియుఁడఁటే? కాదు విను మందె వెలఁదిమిన్న.

## కైతవాపహ్నవాలంకారః

శ్లో॥ కైతవాపహ్నుతి ర్వ్యక్తౌ వ్యాజా ద్యైర్నిహ్నుతేః పదైః
నిర్యాంతి స్మరనారాచాః కాంతాదృక్పాత కైతవాత్.

గీ॥ వ్యాజముఖ పదములచే నపహ్నవింపఁ
బరఁగు నందురు కైతవాపహ్నవంబు
యువతిదృక్పాత మనెడి కైతవమువలన
విరుల విలుకాని శరములు వెడలుచుండె.

## ఉత్ప్రేక్షాలంకారః, తద్భేదాః 12

శ్లో॥ సంభావనాస్యా దుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా
ఉక్తా నుక్తాస్పదా ద్యాత్ర సిద్ధా సిద్ధాస్పదే పరే ౧

శ్లో॥ ధూమస్తోమం తమశ్శంకే కోకీ విరహాశుష్మణాం
లిమ్పతీవ తమోఙ్గాని వర్షతీ వాఞ్జనం నభః ౨

శ్లో॥ రక్తౌ త వాఙ్ఘ్రీ మృదులౌ భువి విక్షేపణా ద్ధ్రువమ్
త్వన్ముఖా భేచ్ఛయా నూనం పద్మై ర్వైరాయతే శశీ 3

శ్లో॥ మధ్యః కిం కుచయోర్ధృత్యై బద్ధః కనకదామభిః
ప్రాయోబ్జం త్వత్పదే నైక్యం ప్రాప్తుం తోయే తపస్యతి.౪

### గీతమాలిక.

విషయికున్న ధర్మము లల విషయమందుఁ
గని విషయియొక్క తాదాత్మ్యము, నుపమేయ
మునకుఁ, నూహింప నుత్ప్రేక్ష, మొదటి దాన
విషయ ముక్త మనుక్తమై వెలయుఁ, దక్క
రెంట సిద్ధ మసిద్ధమౌరీతిఁ దనరు
వస్తు వస్త్వంతరములకుఁ బలుకఁ గృతుల
యందుఁ దాదాత్మ్యము స్వరూపమై తనర్చు
హేతువునుగాని దానిని హేతువుగను
వర్ణనముసేయ హేతువై వఱలుచుండు
ఫలము కానట్టి దానిని ఫలముగాఁగఁ
గృతుల వ్రాయ ఫలోత్ప్రేక్ష యెసకమెసఁగు
నొనర విషయంబు వాచ్యమై యొప్పునేని
ఉక్తవిషయవస్తూత్ప్రేక్ష వ్యక్తమగును
ఒనర విషయంబు వాచ్యమై యొప్పదే, న
నుక్తవిషయవస్తూత్ప్రేక్ష వ్యక్తమగును
హేతువు ప్రసిద్ధమగునేని కృతులలోన
సిద్ధవిషయ హేతూత్ప్రేక్ష చెలఁగునంద్రు
హేతువు ప్రసిద్ధమయి రహియించదే, న
సిద్ధవిషయహేతూత్ప్రేక్షఁ జెప్ప నగును
ఫలముచూడఁ బ్రసిద్ధమై వఱలెనేని
సిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష చెన్నుమీఱు
ఫలము గన నప్రసిద్ధమై పరఁగెనే, న
సిద్ధవిషయఫలోత్ప్రేక్ష చెలువుమీఱు
నిన్నివిధముల నుత్ప్రేక్ష యెసకమెసఁగు.

లక్ష్యములు

గీ. జక్కవల విరహాగ్ని సంజనితమైన
పొగయటంచును నేఁ దమమ్మును దలంతు
నంగములఁ బూతపూసెనా యనఁగఁ దమము,
కాటుకఁ గురిసెనా యనఁ గ్రాలు నభము.

గీ. ఉర్విపై నీ మృదుపదము లుంచుకతన
నెఱ్ఱగా నుండె నంచు నే నెంతు నబల!
నీదు ముఖకాంతి వాంఛ నా నీరజారి
నళినములతోడ వైరం బొనర్చుచుండె.

గీ. కుచభరముఁ దాల్చ నీ కౌను కుందనంపుఁ
గొలుసుల బిగింపఁబడఁబోలుఁ గువలయాక్షి!
తమ్మి పరికింప నీదుపదమ్ముతోడ
నైక్యమొంద నీటను దప మాచరించు.

వివరణము:—అన్యధర్మ సంబంధ నిమిత్తముచేత నన్య వస్తువునకు నన్యతాదాత్మ్యసంభావనమును వర్ణించుట యుత్ప్రేక్ష యనఁబడును.

1. "జక్కవల విరహాగ్నిచే జనితమైన ... దలంతు"-చీకటి యుపమేయము. పొగ యుపమానము. సర్వవ్యాపకత్వము నల్లదనము. దృష్టి ప్రతిరోధము. ఈ మూఁడు ధర్మములు వర్ణ్య మగు చీకటియందున్నవి. చక్రవాకము లెల్లయెడల నుండునవి గావునఁ దద్విరహానలమున నుదయించిన ధూమము (విషయి) సర్వత్ర వ్యాపించియున్నది. కాన సర్వవ్యాపకత్వమును, బొగ నల్లఁగ నుండుటచే నల్లఁదనమును, పొగయందుఁ జూచుట కసాధ్య మగుట (దృష్టిప్రతిరోధకత్వమును,) మూఁడు ధర్మము

లును విషయియందు (ఉపమానమునందు) స్ఫురించుచున్నవి. కావున విషయియొక్క తాదాత్మ్యము విషయమునకుఁ జెప్పఁబడినది. చీఁకటికి ధూమతాదాత్మ్యము నుడువఁ బడినది. విషయమైన తమము పేర్కొనఁ బడినది. గావున నిది ఉక్తవిషయస్వరూపోత్ప్రేక్ష కుదాహరణము.

2. "అంగములకుఁ బూఁతపూసె నాయనఁగఁ దమము, కాటుకఁ గురిసెనా యనఁగ్రాలునభము." అంగములకుఁ బూఁతఁ బూయునటుల, నాకసము కాటుకను వర్షించుచున్నట్లు చీఁకటి వ్యాపించుచున్నదని తాత్పర్యము. అగుచో నిందుఁ జీఁకటి వ్యాపించుచున్న దను మాటను (విషయమును) వదలి చెప్పక పోవుటచేత నుత్ప్రేక్షాధర్మము లన్నియును గలిగి విషయ ముక్తము కాలేదుగాన ననుక్త విషయ వస్తూత్ప్రేక్ష యనఁ బడును.

3. హేతువు కాని దానిని హేతువుగ భావించుట హేతూత్ప్రేక్ష యగును. "ఉర్విపై నీ మృదుపదము లుంచు కతన, నెఱ్ఱగా నుండె నంచు నే నెంతు నబల"-ఇందుఁ బదము లెఱ్ఱగా నుండుటకు భూమియందుంచుట హేతువు కాదు. స్త్రీల మృదుపదములు స్వతస్సిద్ధముగనే యెఱ్ఱగానుండును. హేతువు కాని భూవిక్షేపణమును హేతువుగాఁ జెప్పెను. కావున హేతూత్ప్రేక్ష; విక్షేపణ రూపవిషయము ప్రసిద్ధమగుటవలన సిద్ధవిషయ హేతూత్ప్రేక్ష.

4. హేతు వసిద్ధమయిన యెడల నసిద్ధవిషయ హేతూత్ప్రేక్ష; "ఓయువతీ ! నీదు ముఖకాంతి వాంఛనా నీరజారి, నళినములతోడ వైరం బొనర్చుచుండె". ఇందు విరోధమునకు

స్త్రీ ముఖకాంతినిబొందఁ గోరిక హేతువు. చంద్రబింబ మచేతన పదార్థము కావున నిట్టి కోరికయుండు టసంభవము. ముఖ కాంతినిఁ బొందఁగోరుట యను హేతువు సిద్ధముకాదు. కావున నిది యసిద్ధ విషయ హేతూత్ప్రేక్ష.

5. "కుచభరముఁ దాల్ప నీకౌను కుందనంపు, గొలుసుల బిగింపఁబడఁ బోలుఁగువలయాక్షి"-ఇటవళులే బంగారపు గొలుసులుగ నధ్యవసింపఁబడినవి. ఇట్టి గొలుసుల బిగింపు కుచధారణార్థ మేర్పడినదికాదు. తదర్థమే బిగింపఁబడినదని చెప్పుట చేతను గుచధారణము సిద్ధము గనుక నిది సిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష కుదాహరణము.

6. "తమ్మి పరికింప నీదు పదమ్ముతోడ, నైక్యమొంద నీటను దపమాచరించు" పద్మము జలమందుండుటను దపమాచరించుట యని యుత్ప్రేక్షింపఁ బడినది. కామినీపదైక్యము జలజమునకు ఫలముకాదు. జలజ మట్టి ఫలమును బొందఁ గోరుటయుఁ, బొందుటయు, నసంభవము కావున నిందు ఫల మసిద్ధము గావున నిది యసిద్ధవిషయఫలోత్ప్రేక్ష.

"జక్కవల విరహాగ్నిచే జనితమైన, పొగయటంచును నేఁ దమమ్మును దలంతు" - అను నుదాహరణములో విషయమైన తమము పేర్కొనఁబడినది గావున నిది యుక్తవిషయ వస్తూత్ప్రేక్ష 7.

౧. అతిశయోక్త్యలంకారః 13

శ్లో॥ రూప కాతిశయోక్తి స్స్యా న్నిగీర్యా ధ్యవసానతః
పశ్య నీలోత్పలద్వంద్వా న్ని స్సర న్తి శితా శ్శరాః

గీ॥ తెలిపి విషయి, నధ్యవసాయకలన కతన
దాఁపఁగా నుపమేయంబు దానిఁ గృతుల
యందు రూపకాతిశయోక్తియా నటంచు
వ్రాసినా రలంకార విద్వజ్జనములు.

గీ॥ ఏమి ప్రారబ్ధమో? కాని యిందువదన!
కనికరము సుంత యయినను గాంచ కిటులు
తొగలజతనుండి వాఁడియా తూపు లవిగొ!
వెడలుచుండెను చూడుమో వెలఁది! యిపుడు.

వివరణము:—తొగలజత యుపమానము, స్త్రీ నయన ద్వయ ముపమేయము, వాఁడితూపు లుపమానము, సుదతి చూపు లుపమేయము. ఇందుపమానములు మాత్రము పేర్కొనఁ బడినవి. ఉపమేయములను వచింపలేదు. ఉపమాన ములను బట్టి యుపమేయ వస్తువుల నూహింప వలసియున్నది. విషయముల కుపమాన రూపతచే నధ్యవసాయము. అనఁగా నుపమేయమున కుపమాన తాదాత్మ్యము వర్ణింపఁ బడినది. కావున రూపకాతిశయోక్త్యలంకారము.

౨. సాపహ్నవాతిశయోక్త్యలంకారః

శ్లో॥ య ద్యపహ్నుతి గర్భత్వం సైవ సాపహ్నవా మతా
త్వత్సూక్తిషు సుధా రాజన్ భ్రాన్తాః పశ్యంతి తాం విధౌ

గీ॥ అతిశయోక్తిఁ గూడఁగ నపహ్నుతిని సద్ది
యొప్పు సాపహ్నవాతిశయోక్తి యగుచు
రాజ! సుధ నీదు పల్కుల రంజిలంగ
భ్రాంతు లయ్యది శశియందుఁ గాంతు రకట!

వివరణము:—రాజా! నీ పల్కుల యందలి మాధుర్యమే యమృత మనునతిశయోక్తి; శశి యందున్నది యమృతము కాదను నపహ్నుతితోఁ గూడియున్నది కావున సాపహ్నవాతిశయోక్త్యలంకారము.

౩. భేదకాతిశయోక్త్యలంకారః

శ్లో॥ భేద కాతిశయోక్తిస్స్యా త్తస్యై వాన్యత్వ వర్ణనం
అన్య దేవాస్య గామ్భీర్య మన్య ద్ధైర్యం మహీ పతేః

గీ॥ ఒక్క తెగకు సంబంధించియున్న వస్తు
వునకు నన్యత్వ వర్ణనమును వచింప
నదియె భేదకాతిశయోక్తియై తనర్చు
నతనిలోఁతు వే ఱతని ధైర్యంబు వేఱు.

వివరణము:—లోకములోని గాంభీర్యాది ధైర్యంబులును ప్రభువుయొక్క ధైర్యగాంభీర్యములు నొక్క తెగలోని వైనను నీతని ధైర్య గాంభీర్యములు వేఱని భేదము వర్ణింపఁబడుటచే భేదకాతి శయోక్త్య లంకార మనఁదగును.

౪. సంబన్ధాతిశయోక్త్యలంకారః

శ్లో॥ సంబన్ధాతిశయోక్తి స్స్యా దయోగే యోగకల్పనం
సౌధాగ్రాణి పురస్యాస్య స్పృశంతి విధుమండలమ్

గీ॥ లేని సంబంధ ముండిన లీలఁజెప్ప
నగును సంబంధపూర్వకం బతిశయోక్తి
ఈ నగర సౌధశిఖరంబు లెల్లఁ జంద్ర
మండలంబును దాఁకుచు నుండె నహహ!

వివరణము:—మేడల చివరభాగమునకుఁ జంద్రమండ

లమునకు నేవిధమైన సంబంధము లేకున్నను, జంద్రమండల మును దాఁకుచున్నవని సంబంధమున్నట్లు చెప్పఁబడుటచే సంబంధాతిశయోక్తి.

౫. అసంబన్ధాతిశయోక్త్యలంకారః

శ్లో॥ యోగే ప్య యో గోఽసంబన్ధాతిశ యోక్తిరి తీష్యతే
త్వయి దాతరి రాజేన్ద్ర స్వ ర్ద్రుమా న్నా ద్రియామహే

గీ॥ ఉండు సంబంధమును జెప్ప నుండ దంచు
నగు నసంబంధ పూర్వకం బతిశయోక్తి
క్ష్మాధిపా! నీవు దాతవై యవని నుండ
గణన సేతుమె! మే మింకఁ గల్పకముల.

వివరణము:—కోరిన, కోర్కులనెల్ల నిచ్చునవి గనుక యాచకులు కల్ప తరువుల నాశ్రయించుట యుక్తము. ఈ యుదాహరణములో నట్టి యుక్తసంబంధమును వదలివేసి యాచకులకుఁ గల్పకములకు యాచ్య యాచకరూప సంబంధ ము లేదని వర్ణింపఁబడుటచే నసంబంధాతిశయోక్త్యలంకారము.

౬. అక్రమాతిశయోక్త్యలంకారః

శ్లో॥ అక్రమాతిశయోక్తిస్స్యా త్సహాత్వే హేతుకార్యయోః
ఆలిఙ్గన్తి సమం దేవ జ్యాం శరాశ్చ పరాశ్చ తే

గీ॥ కార్యకారణముల కేకకాలకలన
నక్రమాతిశయోక్తియా నండ్రు కృతుల
పరులు శరములు నొకమాఱె పార్థివేంద్ర!
జ్యాపరీరంభణంబును సల్పు టొనరె;

వివరణము:—కార్యకారణములు రెండు నేక కాల

మందే జరుగుట యక్రమాతిశయోక్తి. కారణోత్పత్త్యనంతరము కార్యోత్పత్తి సహజము. ఇందుఁ దద్భిన్నముగ రెండు నేక కాలోత్పన్నము లగుట చెప్పఁబడుచున్నది. రాజు శరవిమోచనముఁజేయుటయు, శత్రువులు పుడమిపైఁ బడుటయు నేక కాలమునందే జరిగినవని వర్ణింపఁబడినది కావున నక్రమాతిశయోక్త్యలంకారము.

౭. చపలాతిశయోక్త్యలంకారః

శ్లో॥ చపలాతిశయోక్తి స్స్యాత్కార్యే హేతుప్రసక్తిజే
యాస్యామీత్యుదితే తన్వ్యా వలయోభవ దూర్మికా

గీ॥ కారణజ్ఞానమాత్రనఁ గార్య ముదయ
మొంద నది చపలాతిశయోక్తి యగును
వెడలఁగల జేపు నేనని ప్రియుఁడు వలుక
నుంగరం బయ్యెఁ గంకణ మువిద కపుడె.

వివరణము:—పెనిమిటి ప్రయాణమై వెళ్ళిన తరువాతఁ బెనిమిటి విప్రయోగమువలన భార్యకృశించుట సహజము. ఇచ్చట నే నెప్పుడో వెళ్ళెదనని యనిన మాత్రముననే (కృశించుటకు హేతువగు భర్తప్రయాణమును వినిన మాత్రముననే) నాయిక కృశించినదనియుఁ దన్నిమిత్తమున నుంగరము కంకణమైన దనియు వర్ణింపఁబడుటచే, చపలాతిశయోక్తి.

౮. అత్యన్తాతిశయోక్త్యలంకారః

శ్లో॥ అత్యన్తాతిశయోక్తిస్స్యాత్పౌర్వాపర్యవ్యతిక్రమే
అగ్రేమానో గతః పశ్చాదనునీతా ప్రియేణ సా

గీ॥ కార్యమును ముందుఁ బిదపఁ దత్కారణంబు
ననిన నొప్పు నత్యంతము నతిశయోక్తి

ప్రియునిఁ జూచినమాత్రాన వెడలె మాన
మురక బతిమాలఁబడియె నయ్యువిద యవల

వివరణము:—కారణమునువినా కార్యోత్పత్తి కలుగదు. ఈసందర్భములోఁ గార్యము ముందుఁ దదుపరి కారణము వర్ణింపఁబడెను. నాయిక కోపోపశమనము కార్యము. నాయకుఁ డూరడించుట కారణము. కోప ముడిగిన వెన్క నాయకుఁ డూరడించెనని వర్ణింపఁబడినది కావున నత్యంతాతిశయోక్తి.

తుల్యయోగితాలంకారః, తద్భేదాః 14

శ్లో॥ వర్ణ్యానా మితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా
సంకుచంతి సరోజాని స్వైరిణీ వదనాని చ. ౧

గీ॥ వర్ణ్యముల కితరములకుఁ బరఁగు ధర్మ
మొకటి కాఁ దుల్యయోగిత యొప్పుఁ గృతుల
తామరసవైరి పుట్టంగఁ దమ్మిగమియుఁ
గులటల మొగమ్ము తతియు సంకుచిత మయ్యె.

శ్లో॥ త్వదంగ మార్దవే దృష్టే కస్యచిత్తే నభాసతే
మాలతీ శశభృల్లేఖా కదళీనాం కఠోరతా.

గీ॥ మానినీమణి! నీ యంగమార్దవంబు
నీక్షణంబును జేసిన యాక్షణంబె
జ్ఞప్తిఁ దగులదె? మాలతీ కదళికాబ్జ
కళలయం దుండు కఠినతా విలసనంబు.

వివరణము:—ఎచటఁ గేవల ప్రకృతములకుఁ గేవల ప్రకృతములకు నేక ధర్మాన్వయము వర్ణింపఁబడునో? యది

తుల్యయోగితాలంకారము. కేవల ప్రకృతములను వర్ణించినచోఁ గేవల ప్రకృతగోచర యనియును నప్రకృతములను వర్ణించినచోఁ గేవలా ప్రకృత గోచరయనియుఁ జెప్పుదురు. చంద్రోదయము కాఁగనే పద్మసముదాయమును గులటల మొగముతలియు సంకుచిత మయ్యెనన రెండును బ్రకృతము లగుటచేఁ గేవల ప్రకృత గోచర యయ్యె. రెండవ పద్యము నందు సుందరీసౌకుమార్య వర్ణనము ప్రకృత మగుటచే నపకృతములైన మాలత్యాదులకుఁ గఠినతారూపమైన ఏక గుణాన్వయమును వర్ణించుటచేత నప్రకృత తుల్యయోగితా లంకారము.

శ్లో॥ హితాహితే వృత్తి తౌల్య మపరా తుల్య యోగితా
ప్రదీయతే పరాభూతి ర్మిత్ర శాత్రవయో స్త్వయా. 3

గీ॥ రిపుల మిత్రుల సమత వర్ణింపఁ దుల్య
యోగిత హితాహితపు వృత్తి యొప్ప ననిరి
భూతిని బరానుగతముగాఁ బొదలఁ గూర్చి
మిత్రశత్రుల కిడెద వో మేదినీశ!

వివ:—ఇచట రాజు శత్రువులకుఁబరాభూతి నిచ్చెను. మిత్రులకుఁ బరాభూతి నిచ్చెను. శత్రుపక్షమునఁ బరాభూతియనఁ బరాభవము. మిత్రులకుఁ బరాభూతియనఁగా నుత్కృష్టమైన సంపద నిచ్చెనని యర్థము. (పరాభూతి శబ్దమును విడఁదీసి యన్వయించుటకు, తెలుఁగులో సరియయిన యాంధ్రీకరణమురాదు. అయిన నొక విధముగా యత్నించి వ్రాసితిని.)

శ్లో॥ గుణోత్కృష్టై స్సమీకృత్య వచోఽన్యా తుల్య యోగితా
లోకపాలో యమః పాశీ శ్రీ ద శ్శక్రో భవా నపి. 4

గీ. సామ్య మధికులతో వివక్ష యొనరింప
నొప్పును సమీకరణతుల్యయోగి తాఖ్య
శక్రియమపాశిధనదులు క్ష్మాతలేశ!
నీవు నేగురు పాలింతు రేత లగుచు.

వివరణము:—ఉత్కృష్టగుణములు గల శక్రియమపాశి ధనదులతో సామ్యమును వివక్షించి యీ రాజును నీవును వారితోపాటు లోకపాలుఁడవే యని నిర్వచించినాఁడు కావున నిది సమీకరణ తుల్యయోగిత యని చెప్పఁబడినది.

దీపకాలంకారః 15

శ్లో॥ వదన్తి వర్ణ్యాఽవర్ణ్యా నాం ధర్మైక్యం దీపకం బుధాః
మదేన భాతి కలభః ప్రతాపేన మహీపతిః

గీ. వర్ణ్యమున కవర్ణ్యమునకుఁ బరఁగు ధర్మ
మొక్కటైనచో దీపక మొప్పుఁ గృతుల
కరి మదమ్ముచేతను బరాక్రమముచేత
భూవిభుండును మిక్కిలి పొలుపుఁగాంచు.

వివరణము:—ప్రకృత ప్రసంగమునందే వస్తువు గుఱించి ప్రసంగించుచుందుమో తద్వర్ణ్య వస్తువునకును న ప్రకృతమగు నన్యవస్తువునకును ధర్మైక్యము వర్ణించిన దీపకాలంకారము. ప్రకృత లక్ష్యమునందు నేనుఁగును రాజును బ్రకాశించు ననెడి క్రియారూపకైక ధర్మాన్వయము వర్ణింపఁ బడినది. ఇందేది ప్రకృతమో? అది వర్ణ్య మనియు రెండవది యప్రకృత మగుటచే నవర్ణ్య మనియు నూహింపవలెను.

ఆవృత్తి దీపకాలంకారః, తద్భేదాః 16

శ్లో॥ త్రివిధం దీపకావృత్తౌ భవే దావృత్తి దీపకమ్
వర్షత్యమ్బుదమాలేయం వర్షత్యేషాచ శర్వరీ

శ్లో॥ ఉన్మీలన్తి కదమ్బాని స్ఫుటన్తి కుటజోద్గమాః
మాద్యన్తి చాతకా_స్తృప్తాః మాద్యన్తిచ శిఖావళాః,
పదావృత్తి అర్థావృత్తి పదార్థోభయావృత్తి.

గీతమాలిక

కేవల ప్రికృతములకుఁ, గేవలాప్రి
కృతములకునైన, నావృత్తి గీలుకొనిన
దీపకమ్మన, కావృత్తి దీపకమగు.
ఇలను బదపదార్థముల కావృత్తులైన
నీకఁబదార్థోభయముల కావృత్తినైనఁ,
జెప్ప నావృత్తి దీపక మొప్పు మూఁడు
రకములంచును గృతుల నిర్వచన ముండె
"వారివాహ ఇహా తీవ వర్షతీతి
శార్వరీచ వర్షతి" యంచు సకియ కుందు.
వికసితములై యెసఁగెఁ గదంబకములెల్లఁ
గొండమల్లెలు స్ఫుటమయ్యెఁ గొసరికొసరి
తృప్తివడి చాతకములు మదించుచుండె
శిఖులుగూడను మదమును జెందుచుండె.

వివరణము :—విరహిణియగు నాయిక అకాలమునందు మేఘము వర్షించుచున్నదనియు, రాత్రి సంవత్సరప్రాయ మగుచున్నదనియు రెండు వాక్యములయందును "వర్షతి"

యను క్రియాపదమున కావృత్తిచేసి ప్రయోగించుటచేఁ బదావృత్తిదీపకము. ఇట నొకటి నామధాతురూపమని తెలివిడి. రెండవ లక్ష్యములోఁ బూర్వార్థమునందు వికసన స్ఫుట శబ్దములు భిన్నములయ్యు నర్థమొక్కటే కావున నర్థావృత్తి. తృప్తిపడిన చాతకములు మదించుచున్నవనియు, నెమళ్ళును మదించుచున్నవనియును, రెండుపర్యాయములు మదించుచున్న వను పదము నర్థమును నావృత్తిఁ జేయుటచేత నుభయావృత్తి దీపక మనఁదగును. ఆవృత్తి యనఁగా నొకదానిని రెండుమార్లు పల్కుట.

## ప్రతివస్తూపమాలంకారః 17.

శ్లో॥ వాక్యయో రేకసామాన్యే ప్రతివస్తూపమా మతా
తా పేన భ్రాజతే సూరశ్శూరశ్చాపేన రాజతే

గీ॥ రెండు వాక్యాల సామ్యము రెండునుడుల
నమరుచోఁ బ్రతివస్తూపమము చెలంగు
తాపమున వెల్గు లోకబాంధవుఁడు మఱియుఁ
జాపమునఁ గ్రాలు శూరుఁ డుత్సాహి యగుచు.

వివరణము:—వెల్గు, క్రాలు నను క్రియాపదములు భిన్నములయ్యుఁ బ్రకాశించు నను సామ్యము రెండు వాక్యముల యందున్న శూర సూర్యులకు సమానమే యగుట వలనఁ బ్రతివస్తూపమాలంకారము.

## దృష్టాన్తాలంకారః 18.

శ్లో॥ చే ద్బిమ్బ ప్రతిబిమ్బత్వం దృష్టాన్త స్తదలంకృతిః
త్వమేవ కీర్తిమా న్రాజ న్విధు రేవ హి కాంతిమా న్

గీ॥ భిన్నధర్మములను ప్రతిబింబబింబ
భావమునఁ జెప్ప దృష్టాన్తమై వెలుఁగు
కీర్తి మంతుండ వీవెగా క్షితితలేశ!
కాంతిమంతుండు చంద్రుఁడేగా తలంప.

వివ:—రెండు వాక్యములకు బింబప్రతిబింబభావముండెనేని దృష్టాంతాలంకారము. ఉపమానోపమేయవాక్యములయొక్క వేఱు వేఱగు ధర్మములను బింబ ప్రతిబింబభావముచే వర్ణించిన యెడల దృష్టాంతమగును. ఈ రెండు వాక్యములయందున్న కీర్తిమత్త్వకాంతిమత్త్వములు భిన్నధర్మములయ్యును, బింబ ప్రతిబింబ భావముచే వర్ణింపఁబడినది.

నిదర్శనాలంకారః, తద్భేదాః 19.

శ్లో॥ వాక్యార్థయోః సదృశయో రైక్యారోపో నిదర్శనా
యద్దాతుస్సౌమ్యతా సేయం పూర్ణేన్దోరకళఙ్కతా ౧

గీ॥ అట సమానములైన వాక్యార్థములకు
నైక్య మలర నిదర్శన మనిరి కృతుల
దాతకుఁ బ్రసన్నతాగుణ స్థితి, చందు
రుని దగు నకలంకత యని, కొనగవచ్చు.

శ్లో॥ పదార్థవృత్తి మప్యేకే వద న్త్యన్యాం నిదర్శనామ్
త్వన్నేత్రయుగళం ధత్తే లీలాం నీలామ్బుజన్మనోః ౨

గీ॥ విషయి విషయాలలోపల విషయియందుఁ
గాని, విషయ మందైననుగాని యితర
ధర్మ మారోపణము సేయ,దానిఁ గృతిప
దార్థవృత్తి నిదర్శన మనిరి బుధులు,

నందలి దాతయొక్క ప్రసన్నతా గుణస్థితి. రెండవ వాక్య మందున్న చంద్రునియకలంకత యని వర్ణింపఁబడినది. అనఁగా దాత ప్రసన్నతాగుణస్థితి యుపమేయము. శశి నిష్కళంకత యుపమానము. సదృశములైన యీ రెంటికిని నైక్యారోపణము చేయఁబడెను. గనుక వాక్యార్థవృత్తి నిదర్శనము.

2. పదార్థవృత్తి:- ఉపమానోపమేయములలో నొకదానియందు నితరధర్మారోపముఁ జేసిన యెడలఁ బదార్థవృత్తి యగును. నేత్రయుగళమునందు నల్లకలువల యందున్న లీలారూపధర్మ మారోపింపఁబడినది. అనఁగా శోభ యారోపింపఁబడినది. కనుకఁ బదార్థవృత్తి.

3. ఇయ్యది రెండు విధములు:- సదర్థబోధన రూపయనియు, అసదర్థబోధనరూపయనియు, రాజశబ్దముచేత రాజనియుఁ జంద్రుఁడనియుఁ శ్లేష; చంద్రోదయముయినంతనే తమ మడంగె ననెడి దృష్టాంతముచేత రాజవిరోధియు నశించునని ప్రజలకు బోధన మగునట్లు చెప్పుటవలన నిది యసదర్థబోధన రూప నిదర్శన మనఁదగును. సూర్యోదయ మయినంతనే పద్మములకు వికసనమబ్బుట స్వభావమే యయినను దనకు సంపద గలిగినప్పుడు స్నేహితుల కుపకారము చేయవలయునని బోధించుటకై సూర్యుఁడు మిత్రములగు పద్మములకు నుదయించుచునే కాంతి నిచ్చుచున్నాఁడని వర్ణింపఁబడినందున సదర్థబోధనరూప నిదర్శనాలంకారము.

వ్యతిరేకాలఙ్కారః 20.

శ్లో॥ వ్యతిరేకో విశేష శ్చే దుపమే యోపమానయోః
శైలా ఇవోన్నతా స్సన్తః కింతు ప్రకృతి కోమలాః

గీ॥ అధికతను న్యూనతను నుభయంబునను వి
శేష ముపమానమున కంటెఁ జెలఁగిన నుప
మేయ మందద్ది వ్యతిరేకమై యెసంగు
నంచుఁ గృతులలోనఁ గవిజనాళి యనిరి.

గీ॥ గిరులవలె నున్నతులె యయ్యు ధరణియందు
సజ్జనులు చాలఁ గోమలుల్ సహజముగను
అబ్ధివలె వారు గంభీరు లగుచు రాశి
లుదురు గాని పరికృతి మధురులు గనంగ.

వివరణము:– ఉపమానోపమేయములలో దేనికైన విశేషమును జెప్పిన యెడల వ్యతిరేకాలంకారము. ఈ లక్ష్యమందుఁ గొండ లుపమానము; సజ్జను లుపమేయము. పర్వతములయందు లేని కోమలత్వము సజ్జనులయందు వర్ణింపఁబడుటచే నుపమేయాధిక్యము వర్ణింపఁబడినది.

సహోక్త్యలఙ్కారః 21.

శ్లో॥ సహోక్తిస్సహభావశ్చే ద్భాసతే జనరఞ్జనః
దిగన్తమగమత్తస్య కీర్తిః ప్రత్యర్థిభిస్సహ.

గీ॥ పరఁగ జనరంజక సహభావమును వర్ణ
నమును జేయ సహోక్తి యనంగ నొప్పు
నతని యరులతోపాటు కీర్తియుఁ గూడ
వ్యాప్తిఁ గైకొన సకలదిగంతములను.

వివరణము:– ఒక దానిని గూర్చి వర్ణించునపుడు మఱియొకటిఁగూడ ప్రధానముతోపాటు వర్ణింపఁబడిన యది జనరంజకమగు నేని (చమత్కారముగ నుండినను.) అది

సహోక్త్యలంకారము. కీర్తిని గుఱించి వర్ణించుటచేఁ గీర్తితో పాటు శత్రువులుఁగూడ దిగంతములందు వ్యాపించిరని చమత్కార పూర్వకముగ జనరంజకముగ వర్ణింపఁబడినది. కీర్తి దిగంతములకు వ్యాపించెననియు శత్రువులు దిగంతములకుఁ బాఱిపోయి రనియుఁ దాత్పర్యము.

వినోక్త్యలఙ్కారః, తద్భేదాః 22

శ్లో॥ వినోక్తి శ్చే ద్వినాకించి త్ప్రస్తుతం హీనముచ్యతే
విద్యాహృద్యాపి సావద్యా వినా వినయసమ్పదమ్.

గీ॥ స్వల్పమును వీడుటవలనఁ బ్రస్తుతమున
కూహసేయ హైన్యమును వినోక్తి యనిరి
విద్య రమ్యమ యయ్యును వినయశూన్య
మగున యేని యవద్యయౌ, హర్ష మిడదు.

వివరణము:—పాండిత్య ప్రస్తావనలో వినయ మప్రకృత మైన నది లేమిచేఁ బాండిత్యమునకు లోపమని వర్ణించుటచే (స్వల్పమైన వినయము లేకుండుటచే) వినోక్త్యలంకారము.

శ్లో॥ తచ్చేత్కిఞ్చి ద్వినారమ్యం వినోక్తి స్సాపి కథ్యతే
వినాఖలై ర్విభాత్యేషా రాజేన్ద్ర భవత స్సభా.

గీ॥ స్వల్ప మెడఁబాయుటవలనఁ బ్రస్తుతమున
కూహసేయ రమ్యతను వినోక్తి యనిరి
మనుజనాధ! త్వదాస్థానమంటపంబు
ఖలులు లేకుంటఁ జక్కఁగా వెలయుచుండె.

వివరణము:—స్వల్పులగు దుర్మార్గులు లేని కారణమున నీ యాస్థాన మంటపము ప్రకాశించుచున్నదని వర్ణించుటచే వినోక్త్యలంకారము.

సమాసోక్త్యలఙ్కారః 23

శ్లో॥ సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతే ప్రస్తుతస్య చేత్
అయ మైన్ద్రీముఖం పశ్య రక్తశ్చుమ్బతి చన్ద్రమాః.

గీ॥ ప్రస్తుతముఁ బల్కఁ దోఁచ నప్రస్తుతంబు
కవు లనిరి సమాసోక్త్యలంకార మనుచు
చూడు మైంద్రీముఖంబును జుంబనంబుఁ
జేయుచున్నాఁడు రక్తుఁడై శీతకరుఁడు.

వివరణము :—ఇచ్చటఁ బ్రస్తుతము చంద్రోదయవర్ణనము. ఇం దప్రకృతమగు పరకాంతాముఖ చుంబన మాచరించు నాయకుఁడు స్ఫురించు చున్నాఁడు. ఎట్లనగా ఐంద్రీముఖ మనుటవలన నిందర సంబంధినియగు యువతినిఁ జంద్రుఁడు చుంబించు చున్నాఁడనుటవలన నీ నాయిక పరకీయ యని తేలుచున్నది. దీనియందుఁ బ్రకృతముచే నప్రకృతము స్ఫురింపఁ బడుటచే సమాసోక్త్యలంకారము.

పరికరాలఙ్కారః 24

శ్లో॥ అలఙ్కారః పరికర స్సాభిప్రాయవిశేషణైః
సుధాంశుకలితోత్తంస స్తాపం హరతు వ శ్శివః.

గీ॥ పరికరంబగుఁ గృతి నభిప్రాయ సహిత
మగు విశేషణంబును బల్క ఖ్యాతిమీఱ
నమృతకిరణుని నుత్తమాంగమునఁదాల్చు
శివుఁడు మాతాపము నశింపఁజేయుఁగాత.

వివరణము:—శివుఁడు సహజముగఁ దీక్ష్ణస్వభావుఁడ చందురుఁడు చల్లనివాఁడు. చల్లని చందురుని దాల్చుటచే నీశ

రుఁడును జల్లఁదనము నిచ్చి తాపమును బోఁగొట్టు నను నభి
ప్రాయ సహితమైన వర్ణనముఁ జేయఁబడినందునఁ బరికరా
లంకారము.

పరికరాఙ్కురాలఙ్కారః 25

శ్లో॥ సాభిప్రాయవిశేష్యేతు భవే త్పరికరాఙ్కురః
చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవ శ్చతుర్భుజః.

గీ॥ అటవిశేష్యంబు సాకూత మగునయేని
పరికరాఙ్కు రాలంకృతి వఱలుఁ గృతుల
లలిఁ జతుర్విధ పురుషార్థముల నొసంగు
ఘనుఁడు శ్రీ చతుర్భుజ దేవుఁ డని భజింతు.

వివరణము:—విశేష్యమగు చతుర్భుజ దేవుఁడు ధర్మార్థ
కామమోక్షముల నొసంగ సమర్థుఁడని వర్ణించినాఁడు. నాలుగు
చేతు లుండుటవలన నాలుగు చేతులతో నాలుగు పురుషార్థ
ముల నియ్య సమర్థుఁడని విశేష్యము సాభిప్రాయముగ వర్ణింపఁ
బడినందునఁ బరికరాంకురాలంకారము.

శ్లేషాలఙ్కారః తద్భేదాః 26

శ్లో॥ నానార్థ సంశ్రయ శ్శ్లేషో వర్ణ్యావర్ణ్యోభయాశ్రితః
సర్వదో మాధవః పాయా త్స యోగఙ్గామదీధరత్.

గీ॥ బహువిధార్థ పదన్యాస శక్తి శ్లేష
యను నలంకారమగుచుఁ బ్రఖ్యాతి వడసె
"దేవరాట్సయోగంగామదీధరద్ధి
సర్వదో మాధవోఽవతాచ్ఛ" యనునట్లు.

ఈ శ్లేష ముత్తెఱంగులు:—1 కేవల ప్రకృతశ్లేష, 2 కేవ

లాప్రకృతశ్లేష, 3 ప్రకృతాప్రకృతశ్లేష, కేవల ప్రకృతశ్లేష కి యుదాహరణము వచింపఁబడినది. (ఇయ్యది తెలిగింపఁ గష్ట సాధ్యము. దీని తాత్పర్యము శివకేశవులు రక్షింతురుగాకయని.)

శ్లో॥ అబ్జేనత్వన్ముఖం తుల్యం హరిణా హితసక్తినా
ఉచ్చర ద్భూరికీలాల శ్శుశుభే వాహినీపతిః.

గీ॥ సకియ! "అబ్జేన తే ముఖం సమ మభాణి
హ! హరిణా హిత సక్తినా" యనువిధంబు
రాజ! యుచ్చరద్భూరి కీలాలుఁడైన
వాహినీపతి శోభిల్లు భంగిఁ గంటె.

మూలములోని లక్ష్యములను యథాస్థితముగ ననుకరణ చేసి వ్రాసితిని. (వివరణము) పూర్వార్థ మప్రకృతశ్లేష కుదాహరణము. ఓ ప్రియురాలా! నీ ముఖము పద్మముతోడను జంద్రునితోడను దుల్యముగనున్నది. (అనగాఁ జంద్ర నిష్ఠమగు నాహ్లాదకరత్వమును) పద్మనిష్ఠమగు సువాసనాదికమును కలిగి యున్న దనుట. అబ్జశబ్దము ఉభయార్థకము. దీనికి విశేషణ మగు "హరిణా హితసక్తినా" యనునదియు నుభయార్థకమే. ఎట్లనిన - హరిణా=సూర్యునిచేత, ఆహిత=ఉంచబడినటువంటి, సక్తినా=ప్రేమ కలిగినటువంటిది అని పద్మపరమైన యర్థము. (సూర్యుఁడు పద్మబాంధవుఁడుగదా) ఈ పక్షమున నిది సమస్త పదము కాదు. చంద్రపక్షమునందు "హరిణేన ఆహిత సక్తిః యస్య" అని విగ్రహము. (లేడిచేత నుంచఁబడిన సంపర్కము కలది యని యర్థము. "సారంగం కతిచిచ్చ సంజగరిరే") ఉత్త రార్థము ప్రకృతా ప్రకృత శ్లేష కుదాహరణము. భూరి కీలాలము = విస్తారమైన రక్తము, విస్తారమైన నీరు, వాహినీ

పతి=సేనాపతి, సముద్రుఁడు. సముద్రుఁడు విస్తారమైన నీరు వెడలఁగ్రక్కుచుఁ బ్రకాశించుచుండెననియు; సేనాపతి విస్తారమైన రక్తము వెడలఁగ్రక్కుచుఁ బ్రకాశించుచుండె ననియు వర్ణన మగుపడుచున్నది. ఇచ్చటఁ బ్రకృతమగు వాహినీపతివర్ణనమును, అప్రకృతమగు సముద్రవర్ణనమును జరిగినది గావునఁ బ్రకృతాప్రకృత శ్లేషాలంకారము.

ప్రకృతశ్లేష ౧

గీ॥ పలువిధార్థముల్ స్ఫురియించు పదములుంచి
ప్రకృతవర్ణనమును జేసి ప్రస్తుతింపఁ
గా నగును బ్రకృత శ్లేష కబ్బములను
నీరజాసను సోదరి నిన్నుఁ గాచు.

వివరణము:—లక్ష్మి చంద్రసోదరి, గంగ బ్రహ్మ సోదరి, నిన్ను రక్షించును.

అప్రకృతశ్లేష ౨

గీ॥ అప్రకృత వాచకము శ్లిష్టమైన దాని
నందు రప్రకృత శ్లేష యంచు బుధులు
అతివమోవి ప్రవాళ మంచనఁగ నొప్పు
నబ్జ తుల్యంబుగాదె? యీ యతివమోము.

1. ఇం దుపమానశబ్దము శ్లేషింపవలెను. ప్రవాళము:- 1 పగడము, 2 చిగురుటాకు, మోవి విశేష్యము.

2. మోము = విశేష్యము, అబ్జనతుల్యం = చంద్ర తుల్యం, అబ్జన తుల్యం = పద్మతుల్యం, అని యర్థము; గావున ది యప్రకృతశ్లేష.

పరికృతాపరికృతశ్లేష 3

గీ॥ పరికృత మైనట్టి యర్థ, మపరికృతమైన
యర్థమును, రెండునుం గూడ వ్యక్తపరుపఁ
గఁ, బరికృతాపరికృత శ్లేషగా వచింతురి,
విషము గ్రక్కుచు నెల్గొండె విషధరుండు.

ఇందు విశేష్యము శ్లేషింపఁబడవలెను. ప్రకృతవర్ణనము వర్షాకాల వర్ణనము. విషమును అనఁగా, మేఘుఁడు నీరు గ్రక్కుచుఁ బ్రకాశించుచున్నాఁడు. అపరికృతమగు సర్పము విషమును గ్రక్కుచుఁ బ్రకాశించుచున్న దనియు స్ఫురించు చుండుటచేత పరికృతాపరికృతశ్లేష.

అప్రస్తుత ప్రశంసాలఙ్కారః 27

శ్లో॥ అప్రస్తుత ప్రశంసాస్యా త్సా యత్ర ప్రస్తుతాశ్రయా
ఏకః కృతీ శకున్తేషు యోఽన్యం శక్రా న్నయాచతే.

గీ॥ ప్రస్తుతము దోఁచునట్టు లప్రస్తుతంబు
నలర నప్రస్తుత ప్రశంసాఖ్యఁ జెలఁగు
నింద్రునిందక్క యాచింప దితరు నెద్ది?
యదియె సుకృతి యానట్టి విహంగమంబు.

వివరణము :—ఒక మహాదాతనే యాశ్రయించి గౌరవముగఁ గాలముగడపు కవియొక్కచరిత్రము చాతకవర్ణనముచే స్ఫురించుచున్నది. పరికృతవర్ణనము స్వల్పులను యాచింపని మహాపురుషుని గుఱించి, యిట్టియెడ నపరికృతమగు చాతకమును గొప్పనుజేసి "ఇంద్రునిందక్క యాచింప దితరు నెద్ది" యని స్తుతించినందున నప్రస్తుతమగు చాతకప్రశంసచేతఁ

బ్రస్తుతమగు మహాపురుష చరిత్రి స్ఫురించుచున్నందున నప్రస్తుత ప్రశంసాలంకారము.

ప్రస్తుతాఙ్కురాలఙ్కారః 28

శ్లో॥ ప్రస్తుతేన ప్రస్తుతస్య ద్యోతనే ప్రస్తుతాఙ్కురః
కిం భృఙ్గసత్యాం మాలత్యాం కేతక్యాకణ్టకేద్ధయా.

గీ॥ ప్రస్తుంతాంతరమగు నట్టి వార్త గోచ
రించునట్లు ప్రస్తుతము వర్ణింపఁ బ్రస్తు
తాఙ్కురము; భ్రమరమ! కంటకాన్వితమగు
మొగలిపువ్వేందుకే? మాలతి గలుగంగ.

వివరణము:—తుమ్మెద మొగలిపువ్వుపైన వ్రాలుటఁ జూచి సన్నిధినున్న పరవనితాసక్తుఁడగు ప్రియున కన్వయింప వలె నను నిచ్ఛచే నాయిక యనుచున్నమాటలు. తుమ్మెదకుఁ బ్రియునకుఁ బోలిక; తనకు మాలతికినిఁ బోలిక; ముండ్లతో నిండియున్న కేతకికి భయముల కిక్కయగు పరవనితకుఁబోలిక; ఉద్వేగ కారణమగు పరవనితాసంగమము కాని ధనారోగ్యాది నాశన మూలమగు పణ్యాంగనాసంగమము కాని, తగ దను భావము నాయకున కర్థమగునట్లు, ప్రస్తుత మగునట్టి భృంగ కేతకీ సమాగమమునుజూచి ప్రశంసించినందునఁ,బ్రస్తుత మగు భృంగముతోపాటు ప్రస్తుతాంతరమగు నాయకునివార్తయు గోచరించినందునఁ బ్రస్తుతాఙ్కురాలంకారము.

పర్యాయోక్త్యలఙ్కారః తద్భేదాః 29

శ్లో॥ పర్యాయోక్తంతు గమ్యస్య వచో భఙ్గ్యన్తరాశ్రయమ్
నమస్తస్మై కృతౌ యేన ముధారాహువధూకుచౌ. ౧

గీ॥ మఱియొక విధముచేతను మనసునందుఁ
గలుగు వ్యంగ్యార్థమును దా విపులముఁ జేసి
స్ఫుటముసేయఁ బర్యాయోక్తి పొసఁగుచుండు
రాహుదారకుచాపకర్తను భజింతు.

వివరణము :—రాహువును జంపినవాఁడు శ్రీ మహావిష్ణువు. అతనికి నమస్కార మను నర్థమును మనసునం దుంచుకొని సూటిగాఁ జెప్పక రాహు భార్యా కుచములకు నపకృతిఁ జేసినవాఁడని మఱియొక విధముచేత వ్యంగ్యార్థము స్ఫుటముగా బోధ యగునట్లు చెప్పుటచేతఁ బర్యాయోక్త్యలంకారము.

శ్లో॥ పర్యాయోక్తం తద ప్యాహు ర్యద్వ్యాజే నేష్టసాధనమ్
యామి చూతలతాంద్రష్టుం యువాభ్యామాస్యతామిహ.

గీ॥ ఎవ్వ రైనను వాంఛించు నిష్టసిద్ధి
యయిన మిషచేతఁ బర్యాయమగు నటండ్రు
చూతలతఁ జూడఁ బోయెద సుదతి! మీర
లిచట నుండుఁ డే నింతలో నేగివత్తు.

వివరణము:—తనయొక్కగాని పెరలయొక్కగాని ఇష్టసిద్ధి, వ్యాజముచేత నైనచో నదియుఁ బర్యాయోక్తమే. చెలికత్తె, నాయికానాయికులనువదలి యేదో యొక నెపమునఁదాను గదలినఁగాని, వా రిరువురును గ్రీడింప వీలులేదని యెంచి చూతలతఁ జూడఁబోయెద నను నెపమునఁ దొలఁగినది. కాన దంపతు లిరువురు గ్రీడింప వీలైనది. వ్యాజమున నిష్టసాధన మైనది గావునఁ బర్యాయోక్త్యలంకారము.

వ్యాజస్తుత్యలఙ్కారః 30

శ్లో॥ ఉక్తిర్వ్యాజ స్తుతి ర్నిన్దా స్తుతిభ్యాం స్తుతి నిన్దయోః
కస్స్వర్ధుని వివేక స్తే నయసే పాపినో దివమ్. ౧

గీ॥ నిందచే స్తుతి, స్తుతిచేత నింద తోఁచు
పగిదిఁజెప్ప వ్యాజస్తుతి యగును కృతుల
నంపుచున్నావు పాపుల నమరపురికిఁ
గలదె? నీకు వివేక మో గాంగవారి!

శ్లో॥ సాధుదూతి పునస్సాధు కర్తవ్యం కిమితః పరమ్
యన్మదర్థే విలూనాసి దన్తై రపి నఖై రపి. ౨

గీ॥ బాగు దూతిక, బాగమ్మ బాగుబాగు!
ఇంతకన్నను గర్తవ్య మేమి గలదు?
నా కొఱకుఁ బాప! మీవు దంతనఖరముల
కిచ్చి యొడ లెల్ల మిక్కిలి నొచ్చినావు.

వివరణము :— ప్రథమోదాహరణములో నిందచేత స్తుతి. పాపాత్ములకుఁ గూడ స్వర్గప్రాప్తి నిచ్చుచున్నా వను నిందచే, గంగయొక్క పరమోత్కృష్టత్వము ద్యోతితమగు చున్నది. పుణ్యాత్ములు నీలో జలక మాడి స్వర్గమును బొందుట సహజమే. పాపులను గూడ నీలో జలకమాడుకతనఁ బాపము లను బోఁగొట్టి పవిత్రులను జేసి స్వర్గమున కంపుచున్నా వను స్తుతియుఁ దోఁచుచున్నది. రెండవ లక్ష్యములో స్తుతిచేత నింద యయినది. నాచే నంపఁబడి నా కొఱకు నా పతికడకరిగి పాప మాతఁడు గావించిన దుండగములకు సైఁచి, దంతక్షత నఖక్షత ములచేత నొడలెల్ల గాయములుపొంది శ్రమపడితివి. ఇంతకన్న మి యుపకారము సేతువని స్తుతించినట్లు కనబడుచున్నది,

కాని నిజమునకు నిందయే, నేను నా నాయకుని నా కడకుఁ దీసుకొని రమ్మనిపంపఁగా నా పతిని బొంది వచ్చితివా! అను నిందయే స్ఫురించుచున్నందున వ్యాజస్తుత్యలంకారము.

వ్యాజనిన్దాలఙ్కారః 31

శ్లో॥ నిన్దాయా నిన్దయా వ్యక్తిర్వ్యాజనిన్దేతి గీయతే
విధే సనిన్ద్యో యస్తే ప్రాగేక మేవాహరచ్ఛిరః.

గీ॥ నిందవలన నింద స్ఫురించెనేని దాని
నిర్ణయము సేసెదరు వ్యాజనింద యంచు
నొకతలనె దుంచుశివుఁడు నింద్యుండుగాని
హతవిధీ! నిన్నుఁ దూఱుట యర్హ మగునె?

వివరణము:— బ్రహ్మను నిందించుట ముఖ్యాభిప్రాయము.బ్రహ్మచేయు ననను గుణసృష్టివలననిన్నియగచాట్లు కలుగుచున్న వనియు నతఁడు మొదలే లేకున్న బాగుండునని తలంపు. అట్లు బ్రహ్మను నిందింపక బ్రహ్మశీర్షములలో నొక్క తలమాత్రమే దుంచి, తక్కినవి తుంచక మిగిల్చిన శివుఁడు నింద్యుఁడనుటలో నైదుతలలును ద్రుంచినచో బాగుగ నుండెడి దనియు నప్పుడు బ్రహ్మయుండఁడని భావము. శివనిందవలన బ్రహ్మనిందయు స్ఫురించుచున్నది, గనుక వ్యాజనిందాలంకారము.

ఆక్షేపాలఙ్కారః తద్భేదాః 32

శ్లో॥ ఆక్షేప స్స్వయముక్తస్య ప్రతిషేధోవిచారణాత్
చన్ద్ర సన్దర్శయాత్మాన మథవా స్తి ప్రియాముఖమ్. ౧

గీ॥ మొదట నొకటని యోజించి పిదపదాని
కిఁ బ్రతిషేధముం జెప్ప నాక్షేప మనిరి

ఇమ్ము సందర్శనము చంద్రి! యీవుగాక
కామినీమణివదనమ్ము కలదు లెమ్ము!

వివరణము:— మొదటఁ జంద్రదర్శన మపేక్షించి విచారించి చంద్రదర్శనము లేకున్నను నాప్రియురాలిముఖ మున్నది. లెమ్మని చంద్రుని యం దనాదరము కనపఱచెను. మొదట నాదరించి పిమ్మట ననాదరించుటచేత నాక్షేపాలంకారము.

శ్లో॥ ఆక్షేపోన్యో విధౌ వ్యక్తే నిషేధే చ తిరోహితే
గచ్ఛగచ్ఛసి చేత్కాన్త తత్రైవ స్యాజ్జనిర్మమ. 2

గీ॥ అభిమత నిషేధమును గప్పి, యనభిమత వి
ధిని స్ఫుటముసేయ, నాక్షేప మనివచింత్రు
పోవలయునేని పో! నాధ! పోయె దెటకు!
నాస్థలమునందె నాపుట్టు వగునుగాక!

వివరణము:—భర్త తన్నువిడచి చనుట నాయికకనిష్టము. పోవలదని నాయకుని పయనమును నిషేధింపక యభిమత నిషేధమును గప్పి యనభిమత విధియగు పయనమున కంగీకరించినట్లు స్ఫుటముసేసి నీవు చనుము; చనినచో నేను మరణించి యచ్చటనే (నీవు వెళ్ళినస్థలమునందే) పుట్టుదు ననెను, కావున నాక్షేపాలంకారము.

శ్లో॥ నిషేధాభాసమాక్షేపం బుధాః కేచన మన్వతే
నాహం దూతీ తనోస్తాప స్తస్యాః కాలానలోపమః. 3

గీ॥ ఎట నిషేధాన కాభాస మెసఁగు? నచటఁ
గూడ నాక్షేప మగునని కొంద ఱనిరి
దూతి ననుకోక వినుము నీదు చెలిదేహ
తాపమున్నది కాలానలోపమముగ.

వివరణము:—తాను దూతియై యుండియు దూతిని గానని యే నిషేధమును జెప్పినదో? యది నిజమైన నిషేధము కాదు. నిషేధాభాసము. నిషేధమువలెఁ గనుపడుచున్నది, కాని నిషేధముకాదు. నేను దూతినని యెంచి నామాటలయం దవిశ్వాసబుద్ధిచే నీవు రాకుందువేని నీభార్య బతుకఁజాలదు. నిజముగా నీభార్యదేహము కాలాగ్ని తుల్యముగా నున్నదని వచించినది.

విరోధాభాసాలఙ్కారః 33

శ్లో॥ ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఉచ్యతే
వినాపి తన్వి హారేణ వక్షోజౌ తవహారిణౌ.

క॥ వసుధలో విరోధమున కాభాసతను వ
చింపఁగా విరోధాభాస మెసఁగు చుం డు
తన్వి! భవదీయమౌ పయోధరము లెన్న
హారశూన్యంబు లయ్యును హారులై యగు.

వివరణము:—విరోధమున కాభాసత్వ మనఁగా? విరోధముగా నున్నట్లగుపడునేకాని నిజముగా విరోధము లేకుండ నుండుట. హారములు లేకున్నను హారులుగా (హారములు కలవిగా) నున్నవని చెప్పుట విరోధము. హారములు లేకున్నను మనోజ్ఞములను నర్థములో విరోధములేదు. విరోధమున కాభాసత్వము కలదు. కావున విరోధాభాసాలంకారము.

విభావనాలఙ్కారః తద్భేదాః 34

శ్లో॥ విభావనా వినాపిస్యాత్కారణం కార్యజన్మచేత్
అప్యలాక్షారసాసిక్తం రక్తం త్వచ్చరణద్వయమ్. ౧

గీ॥ కారణములేక కార్యంబు కలిగెనేని
ప్రథమమగా విభావన మని పలుకు చుందు
రత్తుక భవత్పదంబుల హత్తకున్న
నెట్టగానుండెఁ బాదంబు లిందువదన !

శ్లో॥ హేతూనా మసమగ్రత్వే కార్యోత్పత్తిశ్చ సామతా
అస్త్రై రతీక్ష్ణకఠినై ర్జగ జ్జయతి మన్మథః. ౨

గీ॥ కారణ మపూర్ణ మయినను గార్యమైన
నది ద్వితీయ విభావన మనిరి కృతుల
నస్త్రము లతీక్ష్ణకఠినంబులైన నేమి?
వానిచే గెల్చు మరుఁడు ప్రపంచమంత.

వివరణము:—కారణము చాలియుండక దుర్బలముగా నున్నను గార్యము నెఱవేఱి నట్లు వర్ణింపఁబడినచోఁగూడ విభావన మగును.

శ్లో॥ కార్యోత్పత్తి స్తృతీయాస్యా త్సత్యపి ప్రతిబన్ధకే
నరేన్ద్రా న్నేవ తే రాజ న్దశ త్యసిభుజఙ్గమః. 3

గీ॥ ఉండియు న్ప్రతిబంధక మొదవెఁ గార్య
మనఁ దృతీయవిభావన మనిరి కృతుల
నుర్వినాయక ! నీదు ఖడ్గోరగంబు
కఱచుచుండె నరేంద్రులఁ గస్సుమనుచు.

వివరణము:—నరేంద్రు లనఁగా? రాజులు, విషవైద్యులును; నీదు ఖడ్గోరగము, తన్ను నిర్జించుటకుఁ దగిన ప్రతిబంధకసామగ్రికలిగిన దక్షులైనను, నీ శత్రురాజులను గఱచుచున్నది. మణిమంత్రౌషధ్యాది చికిత్సలయందు దాఱితేఱిన పాముల

వాండ్రిను బాము కఱచుచున్నది). ప్రతిబంధకసామగ్రియగు మణిమంత్రాదు లుండినను గఱచుట యను గార్యోత్పత్తి కలుగుటవలన విభావనాలంకారము.

శ్లో॥ అకారణా త్కార్యజన్మ చతుర్థీ స్యా ద్విభావనా
శఙ్ఖాద్వీణానినాదో౽య ముదేతి మహ దద్భుతమ్. ౪

గీ॥ కారణము కానిదానిచేఁ గార్యమైన
నది చతుర్థవిభావన మనిరి బుధులు
కమ్రవీణారవమ్ము శంఖమ్మునుండి
యుద్భవించుచునుండె మహాద్భుతంబు.

వివరణము:—వీణారవము శంఖమందుఁ బుట్టుట అసంభవము. వీణారవమునకు శంఖము కారణము కాదు గావున విభావనము ఇట శంఖము కంఠము; వీణారవము సుస్వరము అని తాత్పర్యము.

శ్లో॥ విరుద్ధా త్కార్య నిష్పత్తి ర్దృష్టా కాచి ద్విభావనా
శీతాంశుకిరణా స్తన్వీం హ న్త సన్తాపయ న్తి తామ్.

గీ॥ ఇఁక విరుద్ధకారణమున నెసఁగెఁ గార్య
మన, నయిదవ విభావన మనిరి కృతులఁ
జెలియ ! పాప మేమందును ? శీతకిరణు
కిరణతతి యేచుచుండెను దరుణిఁబాదివి.

వివరణము:—శీతకిరణుకిరణములు ప్రజల కానందమిచ్చును. విరహిణులకు బాధ కలుగఁజేయును. చల్లదనము నిచ్చు కిరణములు తాపము నిచ్చుచున్న వనుటలోఁ దాపమునకు విరుద్ధ కారణములగు కిరణములఁ గారణముగా వచించి

వానిచేఁ దాపము కలుగుట యను కార్యోత్పత్తి వచించుట వలన విభావనాలంకారము.

శ్లో॥ కార్యా త్కారణజన్మాపి దృష్టా కాచి ద్విభావనా
యశః పయోరాశి రభూ త్కరకల్పతరో స్తవ. ౬

గీ॥ కార్యమునఁ గారణోత్పత్తి గలుగఁ గృతుల
వఱలు నారవదియగు విభావనమయి
క్ష్మాధిపా! నీదు కర మనుకల్పతరువు
వలనఁ గీర్తి యనెడినబ్ధి కలిగె నహహా!

వివరణము:—కారణమువలనఁ గార్య ముత్పన్న మగుట లోకమందు సహజము. కార్యమువలనఁ గారణోత్పత్తి అసహజము. సముద్రమునందుఁ గల్పతరువు జనించినది. అట్టి స్థితిలోఁ గర మనుకల్పతరువువలనఁ గీర్తియను సంద్రము దయించిన దనుటవలనఁ (గార్యతః కారణోత్పత్తి వర్ణించుట వలన) విభావనము.

విశేషోక్త్యలఙ్కారః ౩౫

శ్లో॥ కార్యాజని ర్విశేషోక్తి స్సతి పుష్కలకారణే
హృది స్నేహక్షయో నాభూ త్స్మరదీపే జ్వల త్యపి.

గీ॥ పూర్ణకారణాన్విత మయ్యుఁ బొసఁగ దేని
కార్య మద్ది విశేషోక్తిగా రహించు
మదనదీపంబు జాజ్వల్యమానమైన
హృదయ మందలిస్నేహమే యిగుర దయ్యె!

వివరణము:—ప్రసిద్ధకారణసమూహ ముండినను, గార్య ముత్పన్నము కాలేదని చెప్పుదుమేని విశేషోక్త్యలంకారము.

మన్మథుఁడను దీపము వెలుఁగుచున్నను హృదయ మందలి స్నేహము (చమురు) ఇగురదయ్యె. స్నేహము=ప్రేమ అని అర్థాంతరము. దీపము వెల్గుచున్నప్పుడు చమురు నశింపవలెను- అట్లు జరుగలేదు. పూర్ణకారణాన్వీత మయ్యును చమురు నశించుట యను కార్య ముత్పన్నము కాలేదు గావున విశేషోక్త్యలంకారము.

అసంభవాలఙ్కారః 36

శ్లో॥ అసంభవోఽర్థ నిష్పత్తే రసంభావ్యత్వ వర్ణనమ్
కో వేద గోపశిశుక శ్శైలముత్పాటయే దితి.

గీ॥ అగు నసంభవాలంకృతి యర్థసిద్ధి
కెట నసంభవత్వమును వర్ణింతు? రచట
అల్లకొండను పెకలించు గొల్లకూన
యంచు నెవనికిఁ దెలియంగ నయ్యెఁ జెపుమ?

వివరణము:—శ్రీకృష్ణమూర్తి కొండ నెత్తుట యర్థసిద్ధి. కొండనెత్తుట సాధారణముగ నసంభవము కనుక నెవ్వఁడెఱుఁగు ననిచెప్పఁబడినది. అర్థసంసిద్ధి కసంభావ్యత్వము వర్ణింపఁబడినది గావున నసంభవాలంకారము.

అసఙ్గత్యలఙ్కారః తద్భేదాః. 37

శ్లో॥ విరుద్ధం భిన్న దేశత్వం కార్యహేత్వో రసఙ్గతిః
విషం జలధరైః పీతం మూర్ఛితాః పథికాఙ్గనాః.

గీ॥ అగు నసంగతి హేతుకార్యముల కెట వి
రుద్ధభిన్న దేశత్వ మెఱుంగఁబడునొ?
జలధరంబులు విషమును నరగఁ గ్రోలి
మూర్ఛపోయిరి పథికుల ముదిత లకట!

వివరణము:—జలధరంబులు విషము ద్రావుట కారణము, పథికుల భార్యలుమూర్ఛిల్లుట కార్యము. విషము=నీరు; విషము; మేఘములు విషమును పానముచేయుట, పథికాంగనలు మూర్ఛిల్లుట ఇది విరుద్ధము. నిజముగ విషపానముచేత మూర్ఛ సంభవింపవలసినది మేఘములకే. ఇచ్చట నట్లుగాక పథికాంగనలు మూర్ఛిల్లి రనుటచే భిన్న దేశత్వము వర్ణింపఁబడినది గావున విరుద్ధము. భిన్న దేశత్వము కార్యకారణములకు వర్ణింపఁబడుటచే నసంగత్యలంకారము.

శ్లో॥ అన్యత్ర కరణీయస్య తతో న్యత్ర కృతి శ్చ సా
అపారిజాతాం వసుధాం చికీర్ష న్ద్యాం తథాకరోః. ౨

గీ॥ ఒక్కయెడఁ జేయఁదగిన దింకొక్కచోట
నలుపఁగా నసంగతియని పలుకుచుందు
ధర నపారిజాతముఁ జేయు తలఁపుతోడ
స్వర్గమె యపారిజాతంబు సలుపఁబడియె.

వివరణము:—ధరను అపారిజాతము = శత్రుశూన్యముగాఁ జేయు తలంపున స్వర్గమును, అపారిజాతముగాఁ జేసినావనఁగా, పారిజాతవృక్షము లేనిదానిఁగాఁ జేసినావని యర్థము. ఇచ్చట శ్లేషమూలాభేదాధ్యవసాయముచేత భూమి నపారిజాతముగాఁ జేయఁదలఁచి స్వర్గమును; అపారిజాతముగాఁ జేసినావనుటచే నసంగత్యలంకారము, భూమిని శత్రుశూన్యముగను, స్వర్గమును పారిజాత (కల్పవృక్ష) శూన్యముగను జేసినావని వాస్తవార్థము.

శ్లో॥ అన్యత్కర్తుం ప్రవృత్తస్య తద్విరుద్ధకృతిశ్చ సా
గోత్రోద్ధార ప్రవృత్తోపి గోత్రోద్భేదం పురా కరోః.

గీ॥ ఒక్కపనిఁ జేయఁదలఁచి మఱొక విరుద్ధ
కార్యమును జేయఁగా నసంగతియె యందుఁ
గోత్రసంరక్షణముఁజేయఁ గోరి పుట్టి
గోత్రభేదమ్ముఁ సేయు టే గొనము? కృష్ణ!

వివరణము:—గోత్రశబ్దము స్త్రీలింగమైనప్పుడు భూమి యనియర్థము. పుంలింగమైన యప్పుడు పర్వతమని యర్థము. భూమిని, ఉద్ధరింపవలె నను నిచ్ఛగల నీవు పర్వతములను, భూమిని, వరాహావతారమునందు బ్రిద్దలుచేసితివని శ్లేష మూలాభేదాధ్యవసాయమున నిర్వచింపఁబడినది. (గోత్ర సంరక్షణము అగుచో భూపక్షమున సాధ్యసమాసము.)

విషమాలఙ్కారః తద్భేదాః 38

శ్లో॥ విషమం వర్ణ్యతే యత్ర ఘట నాననురూపయోః
క్వేయం శిరీషమృద్వఙ్గీ క్వ తాదృఙ్మదనజ్వరః. ౧

గీ॥ అసదృశ పదార్థములకుఁ బొత్తుబ్బఁజేయ
నయ్యది విషమాలంక్రియ యనిరి కృతుల
నీ శిరీష పేశలగాత్రి యింతి యేడ?
తాదృశంబైన కందర్పతాప మేడ?

వివరణము:—అతిమృదుత్వముగల యువిదయు, అతి దుర్భరమగు మదనసంతాపమును అననురూపములు. ఈ రెంటికి సంఘటన వర్ణింపఁబడినది గావున విషమాలంకారము.

శ్లో॥ విరూపకార్యస్యోత్పత్తి రపరం విషమం మతమ్
కీర్తిం ప్రసూతే ధవళాం శ్యామా తవ కృపాణికా. ౨

గీ॥ కారణవిరుద్ధ కార్యంబు కల్గె ననిన
నదియును విషమాలంకార మనిరి కృతులఁ

పార్థివా! భవన్నీలకృపాణమహహా!

ధవళయశమును గనెడి విస్తారముగను.

వివరణము:-కత్తి కారణము; ధవళయశము కార్యము. నల్లనికత్తి తెల్లనికీర్తిని గనుటచే గారణ విలక్షణమైన స్వరూపము గల కార్యోత్పత్తి వర్ణింపఁబడినది గావున విషమాలంకారము.

శ్లో॥ అనిష్టస్యాప్యవాప్తిశ్చ తదిష్టార్థసముద్యమాత్
భక్ష్యాశయాహిమఞ్జూషాం దష్ట్వాఖుస్తేన భక్షితః. 38

గీ॥ ఇష్టసిద్ధిఁ గోరి యతింప నిష్టసిద్ధి
కాకనిష్టసిద్ధి కలుగఁగా విషమమె!
ఏదొ తిన సర్పమంజూష నెలుక కొఱికి
భక్షితం బయ్యె నయ్యది పాముచేత.

వివరణము:—పాముపెట్టె యని యెఱుంగక భక్ష్యమద్దానియం దేదియో కలదను నాసచే నెలుక పెట్టెను గొఱికి పాముచే భక్షింపఁబడియె. ఇష్టసిద్ధి భక్ష్యప్రాప్తి. అది కాలేదు. అనిష్టసిద్ధి తనమృతి. ఇష్టసిద్ధికి విరుద్ధ ఫలప్రాప్తి వర్ణించుటచే విషమాలంకారము.

సమాలఙ్కారః, తద్భేదాః 39

శ్లో॥ సమంస్యాద్వర్ణనం యత్ర ద్వయోరప్యనురూపయోః
స్వానురూపంకృతంసద్మ హారేణ కుచమణ్డలమ్. ౧

గీ॥ స్వానురూపంబులౌ రెంటి వర్ణనమును
జేయఁగా సమాలంకృతి చెలఁగుఁ గృతుల
సరముచే నొప్పెసంగెఁ గుచద్వయమ్ము
స్వానురూప దివ్యాస్థానసద్మ మగుచు.

వివరణము:—అనురూపములైన రెండు వస్తువుల ఘటన సమాలంకారము. హారమును, కుచమండలమును, అనురూపములు, వీనికి ఘటన వర్ణింపఁబడెను గావున సమాలంకారము.

శ్లో॥ సారూప్య మపి కార్యస్య కారణేన సమం విదుః
నీచప్రవణతా లక్ష్మి జలజాయా స్తవోచితా. ౨

గీ॥ కారణమునఁ గార్యమునకుఁ గలిగిన యను
రూపత సమమనుచుఁ గృతి రూఢమగును
నీటఁబుట్టితి వమ్మరో! నీవు లక్ష్మి!
సముచితముఁగాదె? నీచానుసరణ నీకు.

వివరణము:—కార్యకారణములకు సరిపోయిన దని వర్ణించునెడల సమాలంకారము. నీటఁ బుట్టుట కారణము, నీచానుసరణము కార్యము. నీచానుసరణము (= పల్లపు ప్రదేశానుసరణము)చేయు నీటియందుఁ బుట్టిన లక్ష్మికి నీచానుసరణము (నీచులననుసరించుట)యుక్తమే. గావునఁ గార్యకారణములకుఁ దగియున్నదని వర్ణించుటచే సమాలంకారము.

శ్లో॥ వినానిష్టం చ తత్సిద్ధి ర్యదర్థం కర్తు రుద్యమః
యుక్తో వారణ లాభోయం స్యాలతే వారణార్థినః. ౩

గీ॥ ఎవ్వఁడెదిగోరునో? యది యనిష్టమును గ
నక వలెనేని సమమంచు సుకవు లనిరి
వారణముఁగోరి నీ విట వచ్చినావు
వారణమె నీకు సిద్ధించె బావ ! యిపుడు.

వివరణము:—వారణము=ఏనుఁగు, వారణము=నివా

రణము (అడ్డగింపు) తన బావమఱఁది, ఏనుఁగును బహుమతిఁ బొందు కోర్కెతో రాజదర్శనమున కేగుచుండ దౌవారికు లడ్డగించుటఁ జూచి స్యాలకుఁడు శ్లేషమూలాభేదాధ్యవసాయముచేత నపహసించుచున్నాఁడు. కోరినది వారణము అది యనిష్టమునుగనుక (శబ్దశ్లేషచేత) సంప్రాప్తించినది కావున సమాలంకారము.

చిత్రాలఙ్కారః 40

శ్లో॥ చిత్రం తత్ర ప్రయత్న శ్చే ద్విపరీతఫలేప్సయా
నమన్తి సంత స్త్రైలోక్యా దపి లబ్ధుం సమున్నతిమ్.
గీ॥ అవనిలో విరుద్ధఫలము నభిలషించి
యత్నమొనరింపఁ జిత్రమౌ నందు్ర కృతులఁ
ద్రిజగములకంటె నత్యున్నతి వడయు తలఁ
పునను సత్పురుషులు వినమ్రు లగుచుందు్ర.

వివరణము:—కోరినది యున్నతి, తద్విరుద్ధప్రయత్నము వినమ్రత. ఉన్నతిఁగోరుటవిరుద్ధఫలము కనుకఁజిత్రాలంకారము.

అధికాలఙ్కారః 41

శ్లో॥ అధికం పృథు లాధారా దాధేయాధిక్యవర్ణనమ్
బ్రహ్మాణ్డాని జలే యత్ర తత్ర మాన్తి న తే గుణాః ౧
గీ॥ గొప్పయాధారమునకంటె గొప్పఁ జేసి
చెప్ప నాధేయ మధికమై యొప్పుఁ గృతుల
నే జలాన బ్రహ్మాండము లిమిడియుండె?
నచట నీగుణమ్ములకుఁ జో టమరదయ్యె.

వివరణము:—జల మాధారము గుణము లాధేయము,

బ్రహ్మాంగమము లిమిడిన జలమనుటచే జలము చాల విశాలమైన దని భావము. అంతవిశాలమైన జలమయ్యును నీగుణములకుఁ జోటులేదని జలముకంటె నీగుణము లింకను విశాలమని వర్ణింపఁ బడినది. ఆధారముకంటె నాధేయ మధిక మయినది. కావున నధికాలంకారము.

శ్లో॥ పృథ్వాధేయాద్య దాధారాధిక్యం తదపి తన్మతమ్
కియద్వాగ్బ్రహ్మయ త్రైతే విశ్రామ్య న్తి గుణా స్తవ. ౨

గీ॥ గొప్ప యాధేయమునకంటె గొప్పఁజేసి
చెప్పనాధారమధికమై యొప్పు నిదియు
నీగుణంబులు పూర్తిగానిండియుంట
నక్షరబ్రహ్మ మమితమంచనఁగనొప్పు

వివరణము:— అక్షరబ్రహ్మమాధారము, గుణము లాధేయము. ఆధేయమగు రాముని సుగుణజాలముకంటె నాధారమగు నక్షరబ్రహ్మము నధికముగ వర్ణించుట తటస్థించినది కావున నధికాలంకారము.

అల్పాలఙ్కారః 42

శ్లో॥ అల్పంతు సూక్ష్మా దాధేయా ద్యదాధారస్య సూక్ష్మతా
మణిమాలోర్మికా తేద్య కరే జపవటాయతే.

గీ॥ అల్ప మాధేయమునకంటె నన్యమందు
నధికసూక్ష్మతఁ జెప్పుచో నల్పమంద్రు
నీదునంగుళినున్న మణిమయ ముంగ
రమ్ము జపమాలవోలెఁ గరమ్మునంగె.

వివరణము:_హస్తమాధారము, ఉంగరమాధేయము,

వ్రేలికిఁ బెట్టుకొనునది యుంగరము, కావున స్వ
యుంగరము హస్తమున జపమాల యయినదనఁ
తాపానలముచేఁ గృశించుటవలన నుంగరము జపమా
దని సూక్ష్మమగు నుంగరముకంటె హస్తము స
దయ్యెనని వర్ణించుటచే నల్పాలంకారము.

అన్యోన్యాలఙ్కారః 43

శ్లో॥ అన్యోన్యం నామయత్రస్యా దుపకారః పరస్పః
త్రియామా శశినా భాతి శశీ భాతి త్రియామ

గీ॥ ఒండొరుల కుపకారమై యొప్పునెడల
నద్ది యన్యోన్య మగునంచుఁ బెద్దలందు
రాత్రి రాజిలుచుండెఁ జంద్రమునిచేత
రాజిలెడిఁ జంద్రముంకను రాత్రిచేత.

వివరణము:—దానిచేత నిదియు దీనిచేతన
కారమును బొందుచున్నట్లు వర్ణించుటచే నన్యోన్యాల

విశేషాలఙ్కారః, తద్భేదాః 44

శ్లో॥ విశేషః ఖ్యాత మాధారం వినా ప్యాధేయవర్ణ
గతేపి సూర్యే దీపస్థా స్తమ శ్ఛిన్దన్తి తత్కరా

గీ॥ ఖ్యాతమైన యాధారము ననుట మాని
చెప్ప నాధేయ మద్ది విశేషమగును
భానుఁ డస్తమింపంగ దీపస్థమైన
తత్కరము లార్పుచున్నవి తమమునెల్ల.

వివరణము:—ఆధారము సూర్యుఁడు,
సూర్యకిరణములు, ఆధారము లేకుండ నాధేయ
వచించుటచే విశేషాలంకారము.

శ్లో॥ విశేషస్సోపి యద్యేకం వస్త్వనేకత్ర వర్ణ్యతే
అన్తర్బహిః పురః పశ్చాత్సర్వదిక్ష్వపి సైవ మే. ౨

గీ॥ ఒక్కటియె పెక్కుచోటులం దున్నయట్లు
చెప్పి శ్లాఘింపనౌను విశేష మనఁగ
నంతరంబున వెలుపల నరయ ముందు
వెన్కలను సర్వదిశలను బ్రియయె తోఁచు.

వివరణము:—కాముకుఁ డగుటచే నిరంతర తన్మయత్వమున సర్వదిక్కులయందును నెక్కడఁ జూచినను బ్రియురాలే కనుపడుచున్నట్లు వర్ణింపఁబడినది గావున విశేషాలంకారము.

శ్లో॥ కిఞ్చిదారమ్భతోఽశక్య వస్త్వన్తరకృతిశ్చసః
త్వాం పశ్యతా మయా లబ్ధం కల్పవృక్ష నిరీక్షణమ్. 3

గీ॥ స్వల్పయత్నముచేత నసాధ్యకార్య
ముద్భవముగా విశేషమై యొప్పుఁ గృతుల
నిన్నుఁ జూచిన నాకు నోనృపవరేణ్యా !
కనులఁ గట్టుచునుండె నా కల్పతరువు.

వివరణము:—రాజదర్శనము, కల్పవృక్షదర్శనమును బట్టి చూచినచోఁ జాలఁ దేలికది యగుటచే స్వల్పారంభ మనుకోఁదగు. అట్టి స్వల్పమున కుపక్రమించిన తనకు గొప్ప లాభము (కల్పవృక్ష దర్శనరూపము) చేకూరినది. అనఁగా రాజు కల్పవృక్షతుల్యుఁడని పరమార్థము.

వ్యాఘాతాలఙ్కారః, తద్భేదాః 45

శ్లో॥ స్యాద్వ్యాఘాతోऽన్యథాకారి తథాకారి క్రియేత చేత్
వైర్జగత్ప్రియతే హన్తి తైరేవ కుసుమాయుధః. ౧

గీ॥ అట్లయగు కార్యసాధన మట్లు కాఁద
గని విరుద్ధకార్యంబు సాధనముఁజేసి
పల్క వ్యాఘాతమగు నందుర్; ప్రజల్కేవి
యింహా! వానినే గొని వారి నేచు మరుఁడు.

శ్లో॥ దృశాదగ్ధం మనసిజం జీవయన్తి దృశైవ యాః,
విరూపాక్షస్య జయినీ స్తాః స్తువే వామలోచనాః. ౨

గీ॥ దృక్కుచే నీరయిన మారు దృక్కుచేత
నే పునర్జీవితునిఁ జేసి యీ పురారిఁ
గూడ నిర్జించి తమనిరంకుశతఁ జూపు
వామనయనల నేర్పు నేఁ బ్రస్తుతింతు.

వివరణము:—ఒకమానిసి యొకవిధమైన కార్యమునకు సాధనమైన వస్తువును, తద్విరుద్ధకార్యమునకు సాధనముగాఁ జేసెనేని వ్యాఘాతాలంకారము. లోకమున కింపగు పూవులఁ గొని కుసుమాయుధుఁడు (మన్మథుఁడు) లోకమును బాధించుచున్నాఁడు. (2) విషమాక్షుఁడగు నీశ్వరుని దృక్కుచే దహింపఁబడిన మదనుని తమ దృక్కుచేతనే జీవింపఁజేసి విషమనేత్రుని సైతము నిర్జించు మనోహర నయనలగు వనితలను స్తుతించుచున్నాను. స్త్రీలు విరూపాక్ష ప్రతిభటలగుటచే వారిని నుతించుచున్నానని కవి యుద్దేశము. శివునిచే నేదృక్కుమదనమారణ సాధకముగఁ జేయఁబడినదో? శివ విరోధులగు స్త్రీలచే నా దృక్కు మన్మథజీవన సాధనముగఁ జేయఁబడుటచే వ్యాఘాతాలంకారము.

శ్లో॥ సౌకర్యేణ నిబద్ధాపి క్రియా కార్య విరోధినీ
దయాచే ద్వ్యాల ఇతి మ య్యపరిత్యాజ్య ఏవ తే. 3

గీ॥ ఒక్కసాధనమున నొక్కఁడొక్క పని స
లుపు నెడల నన్యుఁ డది తద్విరుద్ధ కార్య
సాధనముఁజేయ వ్యాఘాతసంజ్ఞ; ఱేఁడ!
పిల్లఁడను దయ నీకున్న విడుతు వెట్లు?

వివరణము:—ఇచట రాజు బాల్యహేతువుచేతఁ గొమరుని విడిచి జైత్రయాత్రకుఁ బోనుంకింపఁగా బాలుఁడదే కారణమును బురస్కరించుకొని తద్విరుద్ధ కార్యమగు రాజువెంటఁ దన్ను (కుఱ్ఱవానిని)ఁ దీసికొని పోవుటను గుఱించి సమర్థించినందున వ్యాఘాతాలంకారము.

కారణమాలాలఙ్కారః 46

శ్లో॥ గుమ్ఫః కారణ మాలాస్యా ద్యథా ప్రాక్ప్రాన్తకారణైః,
నయేన శ్రీ శ్శ్రియాత్యాగ స్త్యాగేన విపులం యశః. ౧

గీ॥ పూర్వపూర్వములను హేతువులుగ నుత్త
రోత్తరంబు లావాటికి నొనరఁజేయఁ;
బూర్వపూర్వములకు హేతువు లగునట్టు
లుత్తరోత్తరంబులనైన హత్తఁజేయ.

గీ॥ ధరను గారణమాలఁగాఁ దద్జ్ఞు లనిరి
నీతిచేతను సంపత్తుచేతి కబ్బ
సంపదల దాన మెంతయో సలుపవచ్చుఁ
దానమున సద్యశంబబ్బి తనరెదయ్య!

వివరణము:—ఈలక్ష్యములోఁ బూర్వపూర్వవస్తువు లుత్తరోత్తరములకుఁ గారణమై యున్నవి.

శ్లో॥ భవన్తి నరకాః పాపా త్పాపం దారిద్ర్యసమ్భవం,
దారిద్ర్య మప్రదానేన తస్మా ద్దానపరో భవ. ౨

గీ॥ నరకములు గల్గుఁ బాపమునను, నఘమ్ము
పొసఁగుచుండును దారిద్ర్యముననుం, సంభ
వమగు దారిద్ర్య మప్రదానమునఁ. గాన
దానశీలుండ వగుచును దనరు మాధవ!

ఈ లక్ష్యములో నుత్తరోత్తరములు పూర్వపూర్వములకుఁ గారణములై యున్నవి.

ఏకావళ్యలఙ్కారః 47

శ్లో॥ గృహీతముక్తరీత్యార్థ శ్రేణి రేకావళీ మతా,
నేత్రేకర్ణా న్తవిశ్రాన్తే కర్ణౌ దోస్తమ్భచుమ్బినౌ. ౧

గీ. వెనుకవానికి ముందువి, వెనుకటివి గ
న మునువానికిని, విశేషణములుగను గృ
హీత ముక్తరీతినిఁ జెప్పఁ గృతులయందు
దాని నేకావళిగఁ బలెద్కరు సుకవులు.

మొదటిదాని కుదాహరణము.

శ్లో॥ దోస్తమ్భౌ జానుపర్యన్త ప్రలమ్బన మనోహరౌ,
జానునీ రత్నముకురౌ కాన్తే తస్య మహీభుజః. ౨

గీ॥ అక్షు లాకర్ణవిస్తారమై తనర్చు
కర్ణములు బుజములదన్కఁ గ్రాలుచుండు
బుజము లాజానులంబులై పొలుపు మీఱు
జానువుల్ రత్నముకురముల్ క్ష్మాపవిభునకు.

వివరణము:—గృహీతముక్తరీతి యనఁ బూర్వపూర్వములకు నుత్తరోత్తరములుగాని, యుత్తరోత్తరములకుఁ బూర్వపూర్వములుగాని విశేషణభావము గలిగి యుండవలెను. కన్ను

లను గ్రహించి వదలి, కర్ణములు గ్రహింపఁబడి వదలఁబడినవి. భుజములు గ్రహించి వదలి జానువులు గ్రహింపఁబడినవి. ఇట్లెన్నియేని గ్రహింపవచ్చును. అక్షు లాకర్ణవిస్తారము లన్నప్పుడు పూర్వములకు, ఉత్తరములు విశేషణములు. ఇట్లే రెండవదాని కుదాహరణ మూహింపవచ్చును.

మాలాదీపకాలఙ్కారః 48

శ్లో॥ దీపకైకావళీయోగా న్మాలాదీపక ముచ్యతే
స్మరేణ హృదయే తస్యా స్తేన త్వయి కృతా స్థితిః.

గీ॥ దీపకైకావళులను సంధించు నెడలఁ
గవులు దాని మాలాదీపకం బటండ్రు
ఆపె మనము మన్మథునకు నయ్యో వసతి;
ఆపె మనమున కిప్పుడీవైతివేడ.

వివరణము:—అయ్యోవసతి యను క్రియ రెంటియందును నన్వయము చేయుటచే దీపకము. మన్మథునకు మనస్సు, మనస్సునకు నీవు వసతియని ఉత్తరోత్తరమునకుఁ బూర్వపూర్వ విశేషణభావము చెప్పుటచే నేకావళి గావున మాలాదీపకాలంకారము.

సారాలఙ్కారః. 49

శ్లో॥ ఉత్తరోత్తర ముత్కర్షః స్సార ఇత్యభిధీయతే
మధురం మధుపీయూషం తస్మా త్తస్మా త్కవేర్వచః.

గీ॥ ఉత్తరోత్తర ముత్కర్ష మొప్పునట్లు
వర్ణనముఁజేయ సారమై వఱలు ననిరి
తేనె తీపి దానికి హెచ్చు తీపి యమృత
మంతకంటెను గవివాణియతి మధురము.

వివరణము:—ఒకటికంటె నొకటి యుత్తరోత్తరోత్కర్షముగ వర్ణింపఁబడిన దని స్పష్టము.

యథాసంఖ్యాలఙ్కారః 50

శ్లో॥ యథాసంఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయః
శత్రుం మిత్రం విపత్తించ జయ రఞ్జయ భఞ్జయ.

గీ॥ ధర సమాన సంఖ్యాపదార్థముల కరయఁ
గ్రమముచేత సమన్వయింప మహి నద్ది
యగు యథాసంఖ్య; మరులను నాప్తులను వి
పత్తిని జయింపు మలరింపు ముత్తరింపు.

వివరణము:—దీనినే క్రమాలంకారమనియు నందురు. అరులను, జయింపుము, ఆప్తుల నలరింపుము, విపత్తి నుత్తరింపు మని సమన్వయము.

పర్యాయాలఙ్కారః తద్భేదాః 51

శ్లో॥ పర్యాయో యది పర్యాయే ణైకస్యానేకసంశ్రయః
పద్మం ముక్త్వాగతా చన్ద్రం కామినీ వదనోపమా. ౧

గీ॥ ఒక్క సాదృశ్యము క్రమానఁ బెక్కులైన
యాశ్రయమ్ముల నందఁ బర్యాయ మగును
తరుణి వదనసాదృశ్యము తమ్మివీడి
పూలవిలుకాని మామలోఁ బోయిచేరె.

శ్లో॥ ఏకస్మి న్య ద్యనేకంవా పర్యాయ స్సోపి సమ్మతః
అధునా పులినం తత్ర యత్ర స్రోతః పురా జని. ౨

గీ॥ వస్తువొకదానిఁ గ్రమముగా వస్తుసంఘ
మాశ్రయింపంగఁ బర్యాయ మనిరి కృతులఁ

బూర్వ మెచ్చట వాహిని పొరలుచుండె?
వింత యిపుడటఁ బులిన మావిర్భవించె;

వివరణము:—ఒక వస్తువునకే; యొకటి తర్వాత మఱి యొకటి చొప్పునఁ బెక్కు నాశ్రియములు చేరుటొకవిధము, ఒక్కయాధారమునం దొకటి తరువాత మఱియొకటి చొప్పునఁ బెక్కువస్తువు లుండినట్లు వర్ణించు నెడల మఱియొక విధము నునై పర్యాయాలంకారము రెండువిధముల వఱలు.

పరివృత్త్యలఙ్కారః తద్భేదాః 52

శ్లో॥ పరివృత్తి ర్వినిమయో న్యూనాభ్యధికయో ర్మిథః
జగ్రాహైకం శరం ముక్త్వా కటాక్షాం త్సరిపుశ్రియామ్.

గీ॥ స్వల్పమిడి హెచ్చు హెచ్చిడి స్వల్పము సమ
మిడి సమముఁగొనఁ బరివృత్తి యెసకమెసఁగు
బాణమొక్కటి ఱేఁ డేసి పరనృపాల
రాజ్యలక్ష్మీకటాక్ష సంగ్రాహి యయ్యె.

ఇయ్యది స్వల్పమిడి యెచ్చుగొనుటకు లక్ష్యము, తక్కిన రెండు ఉదాహరణములు నిట్టే చూచుకొనవలయును.

పరిసంఖ్యాలఙ్కారః 53

శ్లో॥ పరిసంఖ్యా నిషిధ్యైక మేకస్మి న్వస్తు యన్త్రణమ్
స్నేహక్షయః ప్రదీపేషు నస్వాంతేషు నతభ్రువామ్.

గీ॥ ఒక్క వస్తువు నొకచోట నొనర నియమ
న మొనరించి యొక్కెడ నిషేధమును దాని
కే యొనర్చినఁ బరిసంఖ్య మెసఁగు నంచు
వ్యాకరించిరి కోవిదవరులు కృతుల.

గీ॥ ఎన్నఁడైనను వింటిమే? యిట్టిచిత్ర
మవనిలోఁ బలఁగంటిమా? యానతిమ్ము
స్నేహమది ప్రదీపముల నశించెఁగాని
స్త్రీలమది నది లవము నశింప దయ్యె.

వివరణము:—ఒకచోట నొకదానిని నియమించి మఱి యొకచోట నదిలేదని నిషేధించినచోఁ బరిసంఖ్యాలంకారము. దీపములయందుఁ జమురు నశించెననుట, స్త్రీలచిత్తములందు నశించుటలేదని నిషేధము, దీపములు సుదతుల చిత్తములు భిన్నదేశములు. ఒకచోట క్షయమును గనుచున్నట్లుచెప్పి మఱి యొకచోటను "స్త్రీల హృదయమునందు" దానిని నిషేధించుట చేతను బరిసంఖ్యాలంకారము, ఇట స్నేహశబ్దము శ్లిష్టము.

వికల్పాలఙ్కారః 54

శ్లో॥ విరోధే తుల్యబలయో ర్వికల్పాలంకృతి ర్మతా
సద్య శ్శిరాంసి చాపాన్వా నమయంతు మహీభుజః.

గీ॥ అరయఁ దుల్య బలయుత పదార్థములకు
వైరమును జెప్పఁగా వికల్పమగుననిరి
ఆలకింపుఁడు ఱేఁడు లిష్వాసము లనో?
శిరములనొ? వంచుఁడిఁక జాగుసేయవలదు.

వివరణము:—సమాన ప్రాధాన్యము గలవానికి విరోధమును జెప్పుట వికల్పాలంకారము. ధనుస్సులనైన వంచుడు, లేదేని తలలువంచుఁడు అనఁగా సంధినిఁ జేసికొనుఁడు. లేదా; యుద్ధమొనర్పుడు రెండును సమాన బలము కలవియేకాని శిరములు వంచిన ధనుస్సులు వంచుట తటస్థింపదు. ధనుస్సులు

వంచిన శిరములు వంచుట తటస్థింపదు. కావున వికల్పాలంకారము.

సముచ్చయాలఙ్కారః తద్భేదాః 55

శ్లో॥ బహూనాం యుగపద్భావభాజాం గుమ్ఫస్సముచ్చయః
నశ్యన్తి పశ్చాత్పశ్యన్తి భ్రమన్తిచ తవాహితాః.

గీ॥ ఒక్క సమయాన గాఁదగ్గ పెక్కు లౌ ప
దార్థములు గూడఁగ సముచ్చయంబు దనరు
క్షయము గనుచుండ్రు పాఱుచుఁ గాంచుచుండ్రు
భ్రమయుచుందురు చూడ నీ వైరిచయము.

వివరణము:— వైరులు క్షయముఁగనుట; పాఱుట, కాంచుట, భ్రమయుట, మొదలగు పనులన్నియు నేక కాలమందుఁ దటస్థించుటచే సముచ్చయాలంకారము.

శ్లో॥ అహం ప్రథమికా భాజా మేకకార్యాన్వయోపి సః
కులం రూపం వయో విద్యా ధనంచ మదయన్త్యముమ్.

గీ॥ ఒక్క కార్యంబు సేఁతకుఁ బెక్కుమంది
నేను నేనని తోడ్పడ నౌనదియును
జాతి విద్యావయోరూపసంపదలు ప్ర
మత్తుఁగాఁ జేయుచున్నవి మనుజపతిని.

కారకదీపకాలఙ్కారః 56

శ్లో॥ క్రమికైకగతానాం తు గుమ్ఫః కారకదీపకమ్
గచ్ఛత్యాగచ్ఛతి పునః పాన్థః పశ్యతి పృచ్ఛతి.

గీ॥ క్రమమున నలిగెడి నేకకారకగత
ములగు నర్థముల గ్రథనము గ్రహింద్రు

లనిరి కారకదీపకంబనుచు; నరుగు
పథికుఁడు మఱివచ్చుఁ గనును బ్రశ్నఁజేయు.

వివరణము:—ఏకకర్తతో నన్వయించునవి యేకకారక గతములు. పథికుఁ డీ క్రియలన్నిటితో నన్వయించు చున్నందునఁ గారక దీపకాలంకారము. ఈక్రియ లన్నియు నేకసమయమున జరిగిన సముచ్చయమే యగును. ఈక్రియలన్నియు నేకసమ యమునఁ బొసఁగవు. కావునఁ గారకదీపకాలంకార మయ్యెను.

సమాధ్యలఙ్కారః 57

శ్లో॥ సమాధిః కార్యసౌకర్య కారణాన్తరసన్నిధేః
ఉత్కణ్ఠితాచ కులటా జగామాస్తం చ భానుమాన్.

గీ॥ కారణాంతరమునఁ దన కార్యమునకు
సుకరత గలుగంగ సమాధి ప్రకటమగును
కొమ్మ యిచ్ఛమైఁ బోవంగఁ గోర్కెవడియె
నందు కనువుగఁ గ్రుంకె నహస్కరుండు.

వివరణము:—జారస్త్రీ ప్రియాభిసరణమునకుఁ బొద్దు గ్రుంకవలె ననిగాని, చీఁకటిపడవలె నని గాని, కోరలేదు. దాని యంతట నది మోహపరవశయై పోవుచుండఁ, గాక తాళీయ న్యాయమున నస్తమయమయినది, కార్యమునకు సంబంధించిన కారణము గాక మఱియొక కారణమువలనఁ దనప్రయాణము నకు మఱింత సౌకర్య మేర్పడినందున సమాధ్యలంకారము.

ప్రత్యనీకాలఙ్కారః 58

శ్లో॥ ప్రత్యనీకం బలవతశ్శత్రోః పక్షే పరాక్రమః
జైత్రనేత్రానుగౌ కర్ణౌ వుత్పలాభ్యా మధఃకృతౌ.

గీ॥ పరుఁ డజేయుఁడగుటను దత్పక్షమునకుఁ
గష్టిఁ గొలుపుటఁ బ్రత్యనీకం బటందు
జైత్రనేత్రానుగములైన శ్రోత్రములను
గ్రిందుఁబఱచె నుత్పలములు సుందరవదన!

వివరణము:—బలవంతుఁడైన శత్రువున కపకారము చేయలేక యతని పక్షములో నున్న వారి కపకారముఁజేసి పరాభవించుట ప్రత్యనీకము. నేత్రము లుత్పలముల జయించునవి. తమ్ము జయించిన నేత్రముల కపకారము చేయలేక యుత్పలములు నేత్రానుగములైన కర్ణములను గ్రిందుపఱచినవి; అనఁగాఁ జెవులయందుఁ బుష్పములుంచుకొందురు. ఉత్పలములు పైని, గర్ణములు క్రిందుగ నుండుటచేఁ గ్రిందుపఱచెనని చెప్పఁబడినది. కానఁ బ్రత్యనీకాలంకారము.

కావ్యార్థాపత్త్యలఙ్కారః 59

శ్లో॥ కైముత్యే నార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే
స జిత స్త్వన్ముఖే నేన్దుః కా వార్తా సరసీరుహామ్.

గీ॥ "కిముత" శబ్దజన్య మగు న్యాయమునఁ దనకు
నర్థ సంసిద్ధి కలుగుచో నద్ది కావ్య
పూర్వకమగు నర్థాపత్తి పొసఁగుఁ గృతుల
చంద్రునే గెల్చె మోమంబుజంబు భరమె?

వివరణము:—కైముతిక న్యాయముచేతఁ గార్యసిద్ధి యయినచోఁ గావ్యార్థాపత్తి; పద్మములను జయించినవాఁడు చంద్రుఁడు, అట్టి చంద్రునే నీ ముఖము జయింపఁగా నింకఁ బద్మములను జయించుట లెక్కయా? యని చెప్పుటచేతఁ గావ్యార్థాపత్త్యలంకారము.

కావ్యలిఙ్గాలఙ్కారః 60

శ్లో॥ సమర్థనీయస్యార్థస్య కావ్యలిఙ్గం సమర్థనమ్
జితోఽసి మన్దకన్దర్ప మచ్చిత్తే స్తి త్రిలోచనః.

గీ॥ పదముగాని, వాక్యముగాని, పరఁగెనేని
హేతువుగఁ, గావ్యలింగమై యెసక మెసఁగు
జితునిఁ జేసితి నిన్నును జిక్కఁ కేల?
యుండె నా నెమ్మదిని నుగ్రుఁ డోయిమదన!

ఇది నాల్గువిధములు. పదార్థమునకుఁ బదార్థమును హేతువుగఁ జూపి సమర్థించుట. అట్లే వాక్యార్థమునకు వాక్యార్థము, పదార్థమునకు వాక్యార్థము, వాక్యార్థమునకుఁ బదార్థము, హేతువుగఁజూపి సమర్థించుటయుఁ గావ్యలింగాలంకార మనఁబడును. జయముఁబొందితినను వాక్యార్థమునకు "నెమ్మనంబున నుండె" నను వాక్యార్థము హేతువగుటవలన వాక్యార్థ హేతుక కావ్యలింగ మనఁదగును.

అర్థాన్తరన్యాసాలఙ్కారః తద్భేదాః 61

శ్లో॥ ఉక్తి రర్థాంతరన్యాస స్స్యా త్సామాన్య విశేషయోః
హనూమా నబ్ధి మతర ద్దుష్కరం కిం మహాత్మనామ్. ౧

గీ॥ ఘనవిశేషము సామాన్యమున, విశేష
మునను సామాన్యమును, సమర్థన మిల నుభ
యవిధ మర్థాంతర న్యాసమై చెలంగు
జలధిఁగపి దాఁటె ఘనులకసాధ్య మెద్ది?

వివరణము:—విశేష విషయమును జెప్పి సామాన్యముచే సమర్థించినను లేక సామాన్యవిషయమును జెప్పి యొక విశేషముచే సమర్థించినను నర్థాంతరన్యాసమై యొప్పును.

ఈ పైయుదాహరణములో సామాన్యము చేత విశేషము సమర్థింపఁ బడినది.

శ్లో॥ గుణవ ద్వస్తుసంసర్గా ద్యాతి స్వల్పోపి గౌరవమ్
పుష్పమాలానుషఙ్గేణ సూత్రం శిరసి ధార్యతే. ౨

గీ॥ గుణవదర్థసంపత్తిచే గొప్పఁదనము
నందుదురు స్వల్పులునుగూడ ఖ్యాతివడసి
సుమచయంబుతోఁ గూడుట సూత్రి మహాహా!
తాల్పఁబడుచుండెఁ దరుణుల తలలయందు.

వివరణము:—స్వల్పమగుదారము గొప్ప (అంతఃపుర స్త్రీలులోనైన) వారగు తరుణుల తలలయందుఁ దాల్పఁబడుచుండెనని విశేషముచే మొదటి వాక్యార్థమగు సామాన్యము సమర్థింపఁబడినది.

వికస్వరాలఙ్కారః 62

శ్లో॥ యస్మి న్విశేషసామాన్య విశేషా త్సవికస్వరః
సనజిగ్యే మహాన్తో హి దుర్ధర్షా స్సాగరా ఇవ.

గీ॥ మహి, విశేషముం జెప్పి సామాన్యమున స
మర్థనముఁ జేసి, చాలదటంచుఁ దృప్తిఁ
గనక యన్యవిశేషమును నుపమాన
మునవో? యర్థాంతరన్యాస మూలమునవో?
వర్ణనముఁజేయ నౌ వికస్వరము కృతుల
నతఁ డసదృశపరాక్రమ హరి యగును
యాదసాంపతిభంగి మహానుభావు
లెల్ల యెడలను దుర్జయు లెఱుఁగుదుకద!

వివ:—సుప్రసిద్ధుఁడగు రాజు వేనిచేతను జయింపఁబడఁడు, మహానుభావులు సముద్రములవలె దుర్జయులుగదా! వర్ణనాంశము రాజు; అతఁడు జయింపఁ బడఁ డనుటకు మహాత్ములు దుర్ధర్షులని సామాన్యముచే సమర్థించి తృప్తి నొనక, సాగరముల వలె నను నుపమానముచే సమర్థించుటం జేసి వికస్వరంబయ్యెను. ఇట్లే రెండవదాని కుదాహరణమూహ్యము.

ప్రౌఢోక్త్యలఙ్కారః 63

శ్లో॥ ప్రౌఢోక్తి రుత్కర్షాహేతౌ తద్ధేతుత్వప్రకల్పనమ్
కచాః కళిన్దజా తీర తమాలస్తోమ మేచకాః.

గీ॥ కడఁగి వస్తుసంబంధి యుత్కర్ష కిలను
గారణముకాని దానిని గారణంబు
గాఁగ నుత్కర్షతకుఁ జెప్పఁ గవులు దాని
ననిరి ప్రౌఢోక్త్యలంకార మనుచుఁ గృతుల.

గీ॥ రుక్మగిరి నున్నయట్టి యర్జున సుమముల
భంగినిఁ గపోలముల్ దెల్లఁబాఱుచుండె
యమునదరిఁ దమాలతరు సంఘములవలెనె
నల్లనగుచుండెఁ జూడుమా! నాతికురులు;

వివరణము:—తమాలవృక్షములు స్వతస్సిద్ధముగా నల్లనివి. యమునానదిలోని నీరు నల్లఁగా నుండునని ప్రసిద్ధి. ఈ యువతికురులు తమాలవృక్షసంఘమువలె నల్లఁగా నుండె ననినఁ జాలును. యమునానదియొడ్డున నుండుటచేఁ దమాల వృక్షములకుఁ గలిగిన విశేష మేమియు లేకున్నను నల్లఁదనమునకుఁ గారణముకాని యమునదరినిఁ దమాలవృక్షముల (నలుపు)

వర్ణోత్కర్షకుఁ గారణముగా వర్ణింపఁబడినందునఁ బ్రౌఢోక్త్యలంకారము.

సంభావనాలఙ్కారః 64

శ్లో॥ సంభావనం యదీత్థం స్యా దిత్యూహోన్యస్యసిద్ధయే
యది శేషో భవే ద్వక్తా కథితా స్స్యు ర్గుణా స్తవ.

గీ॥ అర్థసంసిద్ధి కది యట్లయయిన, నిదగు
నని వితర్కింప; సంభావనాఖ్య పొసఁగు.
శేషుఁడే వక్త యైన; నిశ్శేషముగను
నీ గుణంబులు వర్ణింప నేర్చు నధిప !

వివరణము:—సహస్రముఖములు గల యాదిశేషుండు చెప్ప మొదలిడు నెడల నసంఖ్యాకములగు గుణములు గల నిన్ను వర్ణింపఁగలఁడేమొ? యని యూహించుచున్నాను.

మిథ్యాధ్యవసిత్యలఙ్కారః 65

శ్లో॥ కిఞ్చిన్మిథ్యాత్వసిద్ధ్యర్థం మిథ్యార్థాన్తరకల్పనమ్
మిథ్యాధ్యవసితి ర్వేశ్యాం వశయే త్ఖస్రజం వహన్.

గీ॥ ప్రకృత మనృతభూత మన నప్రకృత మనృత
భూతమైన యర్థాంతరంబును ప్రకల్ప
నంబు, మిథ్యాధ్యవసిత మనంగ నొప్పు
ఖస్రజము నూనుచో వేశ్యకాంత మరగు.

వివరణము:—వేశ్యావశీకరణము యొక్క మిథ్యాప్రసక్తికై దాని కన్యమైన మిథ్యార్థకల్పనము గగనకుసుమ మాలాధారణము. ఆకాశపుష్పము లప్రసిద్ధములు. మాల యంతకంటె హుళిక్కి. వేశ్య వశమగు టంతకంటె హుళిక్కి.

## లలితాలఙ్కారః 66

శ్లో॥ ప్రస్తుతే వర్ణ్యవాక్యార్థ ప్రతిబిమ్బస్య వర్ణనమ్
లలితం నిర్గతే నీరే సేతు మేషా చికీర్షతి.

గీ॥ వర్ణ్యవాక్యార్థమును మాని ప్రస్తుతంబు
నందుఁ దత్ప్రతిబింబమైనట్టి దాని
వర్ణనముఁ జేయ లలితమై వఱలుఁ గృతులఁ
గట్టఁగట్టెడి నీపె నీ ర్వెట్టు పయిని.

వివరణము:—నాయకుఁడు తన దగ్గఱకు వచ్చినప్పు డుపేక్షించి యాతఁ డరగిన పిదప నాతని రాకకై యుపేక్షించుచున్నదని యనుటమాని తత్ప్రతిబింబభూతమైన (సరియైన యర్థము స్ఫురింపఁ దగిన) మాటలు వచించుటచే లలితాలంకారము.

## ప్రహర్షణాలఙ్కారః తద్భేదాః 67

శ్లో॥ ఉత్కణ్ఠితార్థసంసిద్ధి ర్వినాయత్నం ప్రహర్షణమ్
తామేవ ధ్యాయతే తస్మై నిసృష్టా సైవ దూతికా.

గీ॥ యత్నమే లేక యుత్కంఠితార్థసిద్ధి
యైనచోఁ బ్రహర్షణ మగు ననిరి బుధులు
నే యతివఁ బ్రేముడించెనో? నాయకుండు
పంపె దూతిగ దానినే పడఁతి యటకు.

వివరణము:—ఏదూతికను నాయకుఁ డభిలషించెనో ? యా దూతిక నాయకుని ప్రయత్నము లేకయే యతని యొద్దికి నాయికచే దైవవశమునఁ బంపఁబడెను. అప్రయత్నముగా

నుత్కంఠితార్థము సిద్ధించినందుచేఁ బ్రహర్షణాలంకారము.

శ్లో॥ వాఞ్ఛితా దధికార్థస్య సంసిద్ధిశ్చ ప్రహర్షణమ్
దీప ముద్యోతయే ద్యావ త్తావ దభ్యుదితో రవిః. ౨

గీ॥ వాంఛితార్థముకంటెను బ్రబలమైన
యర్థసంసిద్ధి గూడఁ బ్రహర్షణంబె !
దీప మొప్పఁగ హెచ్చింపఁ దివురునంతఁ
దిమిరసంహారి తూరుపుదెస నెసంగె.

శ్లో॥ యత్నా దుపాయసిద్ధ్యర్థా త్సాక్షాల్లాభః ఫలస్యచ
నిధ్యఞ్జనౌషధీమూలం ఖనతా సాధితో నిధిః. 3

గీ॥ ఇల నుపాయసిద్ధికయి యత్నించుచుండ
నచట ఫలమె లభింపఁ బ్రహర్షణంబు
నిధినిఁ గనుఁగొన మూలిక నెమకుచుండఁ
గ్రిక్కున నిధాన మచ్చోటఁ గానుపించె.

విషాదనాలఙ్కారః 68

శ్లో॥ ఇష్యమాణవిరుద్ధార్థ సమ్ప్రాప్తిస్తు విషాదనమ్
దీప ముద్యోతయే ద్యావ న్నిర్వాణ స్తావ దేవ సః.

గీ॥ వాంఛితార్థ విరుద్ధమా వస్తువు లభి
యింపఁగా విషాదన మని కృతుల ననిరి
దీప ముద్ద్యోతితముచేయఁ దివురునంత
నాఱిపోయెను దా దీప మక్కటకట !

ఉల్లాసాలఙ్కారః తద్భేదాః 69

శ్లో॥ ఏకస్యగుణదోషాభ్యా ముల్లాసోన్యస్య తౌ యది
అపిమాం పావయే త్సాధ్వీ స్నాత్వే తీచ్ఛతి జాహ్నవీ.౧

శ్లో॥ కాఠిన్యం కుచయోస్సృష్టం వాఞ్ఛన్త్యః పాదపద్మయోః
నిన్దన్తి విశ్వధాతారం తద్ధాటీ ష్వరియోషితః. ౨

శ్లో॥ తదభాగ్యం ధనస్యైవ యన్నాశ్రియతి సజ్జనం.
లాభోయమేవ భూపాల సేవకానాం నచేద్వధః. 3

## గీతమాలిక

ఒకని గుణదోషములచే మఱొక్క మనుజు
నకవిప్తింప నుల్లాసము కృతులందు
దోసఁగుచేత దోసంగును, దోసఁగుచేత
గుణము, గుణముచేతను మఱి గుణము, గుణము
చేతఁ దోసఁగు, నిట్టు లవనిఁ జెద్దు లొకని
వొకనికిఁ గలుగ నుల్లాస మొప్పఁగృతుల;
సాధ్వి నాలో జలకమాడి సల్పుఁగాత!
నాకు సంశుద్ధి యనుకొను నాకతటిని

వివరణము:—ఇది గుణముచేత గుణము కల్గుట కుదాహారణము; ఆపె యొక్క పాతివ్రిత్య మహిమ గుణముచేత గంగకుఁ బవిత్రితాగుణము వర్ణింపఁబడినది.

పరుగు లిడలేక శత్రుల పడఁతు లెల్ల
అధిప! నీ యుద్ధయాత్రలయందుఁ గుచము
లందుఁ గల బల్మి పదములయందుఁగోరి
విధిని నిందించు చున్నారు వేవిధాల

వివరణము:—ఇది దోషముచేత దోషముకల్గుటకుదాహారణము.

సజ్జనులఁ జేరకుండెడి చంద మరయ
ధన మొనర్చిన పాపమే! యని తలంతు

వివ:—ఇది గుణముచే దోషము కల్గుటకుదాహరణము
చంపకుండంగ విడుచుటే చాల లాభ
మంచు నెంచి రొక్కానొక యధిపు భటులు.

వివరణము:—ఇది దోషముచేత గుణముకల్గుట కుదాహరణము.

అవజ్ఞాలఙ్కారః తద్భేదాః 70

శ్లో॥ తాభ్యాం తౌ యది నస్యాతా మవజ్ఞాలంకృతి ర్మతా
స్వల్పమే వాప్ను లభతే పస్థం ప్రాప్యాపి సాగరమ్. ౧

గీ॥ ఒకని గుణదోషము లితరునకుఁ బొసంగ
కున్నచో నవజ్ఞ యగుచుఁ గొనబుమీఱు
వనధియేనియుఁ దన కొలపాత్రియెంతొ?
యంతయేః యిచ్చు నిడఁగలే దంత కెచ్చు.

వివరణము:— సముద్రమున కపారజల ముండుట గుణము. ఆ గుణము కొలపాత్రకు రాలేదు. ఒకని గుణమువలన నన్యవస్తువునకు గుణము రాలేదు.

శ్లో॥ మీలన్తి యది పద్మాని కాహాని రమృతద్యుతేః. ౧౪

గీ॥ సారసంబులు మొగుడంగ సరసులోన
నమృత కిరణున కగునట్టి హానియేమి?
నల్లకలువలు మొగుడంగ నళినబాంధ
వునకుఁ గల్గిన హాని యే మనుదువయ్య?

వివరణము:— పద్మములు ముడుచుకొని పోవుట దోషము. ఆ దోషము చందురినకుఁ బ్రాప్తింప లేదు. దోషము చేత దోషమురాలేదు.

అనుజ్ఞాలఙ్కారః 71

శ్లో॥ దోషస్యాభ్యర్థనానుజ్ఞా తత్రైవ గుణదర్శనాత్.
విపద స్సంతు న శ్శశ్వ ద్యాసు సంకీర్త్యతే హరిః.

గీ॥ చూచి దోషస్థగుణములచో వ్వెఱింగి
దోసఁగులనె కోరఁగ ననుజ్ఞ యెసక మెసఁగు
కొలుచుచుంటిమి హరిని జిక్కులకు నులికి
కలుగుఁ గావుత మాకుఁ జిక్కులె తలఁచుగ.

వివరణము:— చిక్కులు దోషము. దానియందు గుణము భగవద్ధ్యానము. సర్వకాల సర్వావస్థలయందును జిక్కులు కలుగుచున్నచో భగవద్ధ్యానముఁ జేయవచ్చునని తలంపు. (ఆర్తో జిజ్ఞాసు రర్థార్థి)

లేశాలఙ్కారః 72

శ్లో॥ లేశస్స్యాద్దోషగుణయో ర్గుణదోషత్వకల్పనమ్.
అఖిలేషు విహఙ్గేషు హన్త స్వచ్ఛన్దచారిషు
శుక! పఞ్జరబన్ధస్తే మధురాణాం గిరాం ఫలమ్.

గీ॥ దోసఁగు గలయట్టి దానికి దోసఁగు మాన్పి
గుణము; గుణము కల్గినదాని గుణము వదలి
దోసఁగుఁ; గల్పించి, కృతులయందు లిఖయింప
నదియె సుమ్ము! లేశాలంక్రియ చతుర! విను.

గీ॥ పక్షులెన్నెన్నియో యిట్లు పరుగులిడఁగ
శుకమ! మధురవాక్కులను నేర్చుకతమ సుమి!
నీకుఁ బంజర బంధంబు నివ్వటిల్లె
నందులకె సంతసింపుమా! యాత్మయందు.

వివరణము:—పక్షులకు మధురవాక్కులు లేకుండుట దోషము. స్వచ్ఛందసంచార హేతువగుటచే గుణముగను చిలుకకు మధురవాక్కులుండుట గుణము. ఇది పంజరబంధ హేతువగుటచే దోషముగను వర్ణింపఁబడుటచే; లేశాలంకారము.

ముద్రాలఙ్కారః 73

శ్లో॥ సూచ్యార్థసూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః
నితమ్బగుర్వీ తరుణీ దృగ్యుగ్మవిపులా చ సా.

ఆ. వె. గ్రంథసంచయముల గణుతిఁ గాంచినయట్టి
ప్రస్తుతార్థ మిడెడు పదము లుంచి
సురుచిరంబుఁ గాఁగ సూచ్యార్థ సూచనఁ
జేయ ముద్రయంచుఁ జెప్పనగును.

ఆ. వె. ఘనజఘనభరమున గమనమాంద్య మలర
నక్షియుగము విపులమగుచుఁ దనర
వచ్చుచుండె వీధి బాగుగా వీక్షింపు
మయ్య! పడఁతి యీపె యాటవెలఁది.

వివరణము:—సూచ్యార్థసూచనమనఁగా; సూచింపఁ దలఁచిన యర్థమును సూచించుట. ఇందు స్త్రీని వర్ణించెను ఈ పద్య మాటవెలఁదియని కూడ సూచించినట్లయినది.

రత్నావల్యలఙ్కారః 74

శ్లో॥ క్రమికం ప్రకృతార్థానాం న్యాసం రత్నావళిం విదుః
చతురాస్యః పతి ర్లక్ష్మ్యాస్సర్వజ్ఞ స్త్వం మహీపతే.

గీ॥ ప్రకృతములఁ, బ్రసిద్ధక్రమముపఠితఁ దనరు
క్రమముగానుంప రత్నావళిమహిఁ జెలఁగు

గీ॥ సంగతాన్యవస్తుగుణ సుసంక్రమణము
నొల్లదే నతద్గుణమని యొప్పుఁ గృతులఁ
జిరము నిను రాగ పూర్ణమా చిత్తమందుఁ
జేర్చితినిగాని రాగమ్ముఁ జెందవీవు.

వివరణము:—తనతోఁ గలిసియున్న యన్యపదార్థగుణము స్వీకరింపకుండుట యతద్గుణము, అనురక్తమైన చిత్తము ఎఱ్ఱరంగుగలది; ఎఱ్ఱరంగుగల దానియం దుండు వాఁ డెఱ్ఱఁగా నుండుట సహజము. అట్టిక్కడ జరుగలేదు. కావున నతద్గుణాలంకారము.

అనుగుణాలఙ్కారః 78

శ్లో॥ ప్రాక్సిద్ధస్వగుణోత్కర్షానుగుణః పరసన్నిధేః
నీలోత్పలాని దధతే కటాక్షై రతినీలతామ్.

గీ॥ పూర్వ సిద్ధంపు గుణమునే పొంద నధిక
ముగఁ బరుల సన్నిధి నగు ననుగుణమగుచు
నువిద కీ(క్రే?)గంటి చూపుల నుత్పలంబు
లభ్యధిక నైల్యమును బొందె నహహా! యిపుడు.

వివరణము:— నల్లకలువల నువిదకర్ణములయందుఁ దాల్చుటచేత నేత్రముల సమీపమందున్న కారణమునఁ జూపులయొక్క నల్లఁదన ముత్పలంబులపైఁ బడి మిక్కిలి నల్లఁగానుండెనని భావము.

మీలితాలఙ్కారః తద్భేదాః 79

శ్లో॥ మీలితం యది సాదృశ్యాద్భేద ఏవ న దృశ్యతే
రసోనాలక్షిలాక్షాయా శ్చరణే సహజారుణే.

ందక సాదృశ్యమువలన భిదకనుపడ
యెడల నది మీలితమ యని వచియింతుౘ
హజముగ నెఱ్ఱనైనట్టి సకియచరణ
ందు లత్తుక గానరాదయ్యొ బళిరె!

కామాలభారిణ్యః స్సర్వాఙ్గీణార్ద్రచన్దనాః
పవత్యో నలక్ష్యంతే జ్యోత్స్నాయా మభిసారికాః. ౨

తెల్ల వలువలు దాలిచి మల్లెమాల
ను ధరించి యొడలిపై నలదుచుఁ దెల్ల
ంథ మభిసారికలు వేడ్కఁ గదలిపోవఁ
ఁనఁబడరైరి వెన్నెలలోన నిమిడి.

వరణము:—పాదములకు లాక్షారసమునకు సామ్యము,
నమువలన నేర్పడినది. సుదతిపాదములయందు లాక్షా
పడుటయే లేదు. అనఁగా భేదము కానవచ్చుట లేదని
యము. వెన్నెలకును ధవళవస్త్రమల్లీ స్రగాది భూషితలగు
లకును దెల్లఁదనమనెడి గుణసామ్యమువలన నభేద
ర్శింపఁబడుటచేత మీలితాలంకారము.

సామాన్యాలఙ్కారః 80

మాన్యం యది సాదృశ్యా ద్విశేషో నోపలక్ష్యతే
కరం ప్రవిష్టానాం ముఖం నాలక్షి సుభ్రువామ్.

ామ్యమునను విశేషం బెసంగకున్న
ాఁ గృతులను సామాన్యమంచును వచింతుౘ
మణులెల్లరు పద్మాకరమ్ముఁ నందు
గుట మొగములు చక్కఁగాఁ దెలియఁబడవు.

వివరణము:—పద్మములకును మొగములకును భేద ముండినను; భేదకధర్మ వివేకము కానరాకుండుటచేత సామాన్యాలంకారము.

ఉన్మీలితాలఙ్కారః 81

శ్లో॥ భేద వైశేష్యయోః స్ఫూర్తా వున్మీలితవిశేషకౌ
హిమాద్రిం త్వద్యశో మగ్నం సురా శ్శీతే నజానతే.

గీ॥ సామ్యమునమాసి భిదహేతుశక్తిఁదోప
నద్ది యున్మీలితంబని యనిరి కృతుల
నీశ ! నీయశమ్మున మున్గు హిమనగంబుఁ
దెలిసికొనిరయ్యె ! చలిఁబట్టి దేవతాళి.

వివరణము:—నీ యశస్సు తెల్లనిదగుటచేతఁ బ్రపంచ మంతయు నీ యశం బావరించుటచే సర్వపదార్థములు తెల్లని వగ నుండుటచే హిమనగము నపేక్షించిన సురలు చలికారణమున గుఱితించిరని భేదస్ఫూర్తి చెప్పుటచే; ఉన్మీలితాలంకారము.

విశేషకాలఙ్కారః 82

శ్లో॥ లక్షితా న్యుదితే చన్ద్రే పద్మానిచ ముఖానిచ.

గీ॥ సామ్యమున స్ఫురింపని విశేషమును గార
ణాంతరమ్మునఁ దోఁపింపనగు విశేష
కంబు. శశియుదయింప నాకసమునందు
వదనములు పద్మములు వేఱుపడియె నపుడు.

గూఢోత్తరాలఙ్కారః తద్భేదాః 83

శ్లో॥ కిఞ్చిదాకూతసహితం స్యాద్గూఢోత్తర ముత్తరమ్.
యత్రాసౌ వేతసః పాన్థ తత్రేయం సుతరా సరిత్, ౧

సీ॥ మనసులోనుండు కోర్కెను మరుగుపఱచి
యుత్తరముఁ జెప్పనగును గూఢోత్తరంబు
పథిక యేడ వేతస మట వాహిని సుక
రముగ దాటంగవచ్చుఁ జనుము రయమ్ము

వివరణము:— హృదయమం దొకటి యుంచుకొని చమత్కారముగాఁ దనయభిప్రాయము వెల్లడియగునట్లుగఁ బ్రత్యుత్తర మొసంగుట. బాటసారి నది యెచ్చట సుకరముగ దాఁట వచ్చునని? యడుగఁగా, నదిగో కనఁబడుచున్న వేతసము కడఁ గడుసుకరముగ దాఁటవచ్చునని యుత్తరు వొసంగెను. అందు సాభిప్రాయ మేమనఁగా? ప్రబ్బలిచెట్ల గుంపువద్ద మన మిరువురము స్వేచ్ఛగ వర్తింపవచ్చును. అని సాభిప్రాయ యుక్త వచనమగుటచే గూఢోత్తరము (అనఁగా రహస్యమైన ప్రత్యుత్తరమని యర్థము.)

చిత్రోత్తరాలఙ్కారః

శ్లో॥ ప్రశ్నోత్తరాన్తరాభిన్న ముత్తరం చిత్ర ముత్తరమ్
కే దారపోషణరతాః కే ఖేటాః కిం చలం వయః.

సీ॥ ప్రశ్నవాక్యంబునే యుత్తరంబుఁజేసి
పలుకుటొకవిధంబగును, గృతులను రెండు
ప్రశ్నలకు నొక్కటేయుత్తరంబుఁజెప్పు
టయును జిత్రోత్తరమునై వెలయు ధరిత్రి.

సీ॥ క్షితిని "కేదారపోషణరతు" లను వలె
ఆకసంబున భ్రమియించునట్టి వెవ్వి!
అరయఁజలియించునది యేది యనుచునడుగఁ
బండితులు "వయః" అను పల్కుపల్కుచుంద్రు.

గీ॥ పార్థునకు నిచ్చెనా? కూఁతుఁ బార్షదుండు
అక్షయకుమారుఁ జంపిన యనఘుఁ డెవఁడు?
భూభరంబును వహియించు పుణ్యుఁ డెవఁడు?
హరియటంచును భజియింపు మయ్య! యతని.

వివరణము:— ద్రుపదుఁడు కొమరితను నర్జునున కిచ్చెనా? యను ప్రశ్నమునకుఁ బార్థునకుఁ ఇచ్చెఁ ఆకూఁతుఁ పార్షదుండు అని సమాధానము, అక్షయ కుమారునిఁ జంపిన యనఘుఁడు, హరి=కోఁతి (హనుమంతుఁడు) భూభరంబును వహియించు పుణ్యుఁడు. హరి=పాము (ఆదిశేషుఁడు.)

సూక్ష్మాలఙ్కారః 84

శ్లో॥ సూక్ష్మం పరాశయాభిజ్ఞే తరసా కూతచేష్టితం
మయి పశ్యతి సా కేశైః సీమన్త మణి మావృణోత్.

గీ॥ పరుల హృదయంబు నెఱిఁగిన భావగర్భి
తంబయిన చేష్టనందు సూక్ష్మంబటంచుఁ
దనదు సీమంతమణిని దత్తరుణి నేను
గాంచుచుండఁ గేశమ్ములఁ గప్పివైచె.

వివరణము:—విటుఁడు; నాయికను నీవు సాంకేతికస్థలమున కెప్పుడు వత్తువని కోరుచున్నాఁడని యెఱిఁగి తన సీమంతమణిని గేశమ్ములఁ గప్పినదనఁగాఁ గేశములకుఁ జీఁకటికి సాదృశ్యముండుటవలనఁ జీఁకటి పడిన తరువాత వత్తునని ప్రత్యుత్తరరూపక చేష్టఁ జేయుటచే సూక్ష్మాలంకారము.

పిహితాలఙ్కారః 85

పిహితం పరవృత్తాన్త జ్ఞాతు స్సాకూతచేష్టితం
ప్రియే గృహాగతే ప్రాతః కాన్తాతల్ప మకల్పయత్.

గీ॥ పరులవృత్తాంత మెఱిగిన వ్యక్తియొక్క
వితతసాకూత చేష్టయే; పిహిత మండ్రు
కాంతుఁ డుదయాన నిలుసేరఁగానె వేగఁ
దల్ప మమరించెఁ బ్రోడయౌ తరుణి యపుడు.

వివరణము :— భర్త పరకాంతాసక్తుఁడై రాత్రి యంతయు జాగరణముఁజేసి నిద్రలేక బడలియున్నాఁడని, స్వనాయిక యెఱింగి తద్విషయమును బయల్పఱుపక, సాభిప్రాయమై నిద్రించుటకుఁ దగిన యుపకరణ మమరించుటచేఁ బిహితాలంకారము

## వ్యాజోక్త్యలఙ్కారః 86

శ్లో॥ వ్యాజోక్తి రన్యహేతూక్త్యా యదాకారస్య గోపనమ్.
సఖి పశ్య గృహారామ పరాగై రస్మి ధూసరా,

గీ॥ అన్య హేతూక్తిచేతఁ దదాకృతిని మ
ఱుఁగు పఱిచి పల్క వ్యాజోక్తి యగు ధరిత్రిఁ
బాలఁతి! కనుము గృహారామ పుష్పరజము
చేత ధూసరవర్ణంబుఁ జెందినాను.

వివరణము:—పరపురుషునితోఁ దన యిచ్ఛవచ్చిన తెఱంగున వర్తించివచ్చి తత్సమయమునఁగలిగిన పరాగాదులను మఱుఁగుపఱచు నిచ్ఛచే నన్యహేతు పురస్సరముగఁ దన గృహోద్యానము నందలి పుష్పపరాగముచేత ధూసరవర్ణముఁ జెందినదాన నని చెప్పుటచే వ్యాజోక్తి.

## గూఢోక్త్యలఙ్కారః 87

శ్లో॥ గూఢోక్తి రన్యోద్దేశ్యాచ్చే ద్యదన్యం ప్రతికథ్యతే.
వృషా పేహి పరక్షేత్రా ద్దాయాతి క్షేత్రపాలకః,

గీ॥ ఒకనితో నన నెంచి యింకొకనిఁ గూర్చి
శ్లేషమైఁ బల్క గూఢోక్తి రీతిఁ దనరు
వచ్చుచున్నాఁ డదే! క్షేత్రపాలకుండు
తఱలు వృషపతి పరులక్షేత్రమ్మునుండి.

వివరణము:— ఇతరుల పొలములో నెద్దు మేయు చున్నది. స్వేచ్ఛావిహారులగు విటీవిటు లీ చేనిలోనే విహరించు చున్నారు. విటునకు బోధసేయవలయు ననెడి తలంపుతో నెద్దునుగూర్చి భూమి ఖామందు వచ్చుచున్నాఁడు చనుమని చెప్పుటచే గూఢోక్తి. క్షేత్రపాలకుఁడుఁ (నీవు క్రీడించుచున్న స్త్రీ భర్త యని గూఢోక్తి.)

వివృతోక్త్యలఙ్కారః 88

శ్లో॥ వివృతోక్తి శ్లిష్టగుప్తం కవి నావిష్కృతం యది.
వృషాపేహి పరక్షేత్రా దితి వక్తి ససూచనమ్,

గీ॥ శ్లేషచే గుప్తమా దానిఁ జెలఁగఁ గృతులఁ
గవి బయల్పఱుప వివృతోక్తి విశదమగు
నితరుక్షేత్రమ్మునుండి యో వృషభరాజ!
తొలఁగు మీ! వేగ మనుచును బలికె హితుఁడు.

వివరణము:—శ్లేషచే గోపనము చేయఁబడిన గూఢార్థము, కవిచేఁ గంఠోక్తిగా వివరణము చేయఁబడినచో వివృతోక్తి. ఓ వృషభమా! పరక్షేత్రమును వేగ విడిచిపొమ్మని పక్షున కొక్క చెలికాఁడు సూచనఁగాఁ జెప్పెను. ఇక్కడఁ బర క్షేత్రమును విడువుమను చోటఁగల శ్లేష గుప్తమయిన గూఢార్థము, సూచనఁగాఁ గవిచే వివరింపఁబడినట్లు వర్ణింపఁ బడినందున వివృతోక్త్యలంకారమయినది.

యుక్త్యలఙ్కారః 89

శ్లో॥ యుక్తిః పరాతిసంధానం క్రియయా మర్మగుప్తయే
త్వామాలిఖన్తీ దృష్ట్వాన్యాం ధనుః పౌష్పం కరేఽలిఖత్.

గీ॥ యుక్తియగు; మర్మగుప్త్యర్థ మొరుల వంచ
నమును గ్రియచేతఁ జేయఁగను మహిఁగృతుల
వ్రాయుచును నిన్ను వేఱొక్కపడఁతి రాఁగఁ
బుష్పధనువును గరమునఁ బొలఁతి వ్రాసె.

వివరణము:—ఉపపతి చిత్తఱువును లిఖంచుచుండఁగా నన్యయగు పడఁతి రాఁగఁ దనరహస్యము బయల్పడునని యెంచి చట్టన నా ప్రియుని హస్తమందుఁ బుష్పధనుస్సు నమర్చినది. అంతమాత్రమున నా చిత్తరువు మన్మథుఁడుగా మాఱినదని ఫలితార్థము.

లోకోక్త్యలఙ్కారః 90

శ్లో॥ లోకప్రవాదానుకృతి ర్లోకోక్తి రితికథ్యతే.
సహస్వ కతిచి న్మాసా న్మీలయిత్వా విలోచనే,

గీ॥ అవని లౌకిక సంభాషణానుకరణ
భాషణముల లోకోక్తిగాఁ బలుకుచుంద్రు
అక్షియుగళంబు మూసి మీనాక్షి ! కొన్ని
నెలలు నీవు సహింపఁగా వలయు నెట్లొ ?

వివరణము:—నాలుగురోజు లోపికఁ బట్టు మనెడి లోకవాడుకవలెను

ఛేకోక్త్యలఙ్కారః 91

శ్లో॥ ఛేకోక్తి ర్యత్ర లోకోక్తి స్స్యా దర్థాంతరగర్భితా.
భుజఙ్గఏవ జానీతే భుజఙ్గచరణం సఖే!

గీ॥ ఒకనితో నన నెంచి యింకొకనిఁ గూర్చి
శ్లేషమైఁ బల్కు గూఢోక్తి రీతిఁ దనరు
వచ్చుచున్నాఁ డదే! క్షేత్రపాలకుండు
తఱలు వృషపతి పరులక్షేత్రమ్మునుండి.

వివరణము:— ఇతరుల పొలములో నెద్దు మేయుచున్నది. స్వేచ్ఛావిహారులగు విటీవిటు లీ చేనిలోనే విహరించుచున్నారు. విటునకు బోధసేయవలయు ననెడి తలంపుతో నెద్దునుగూర్చి భూమి ఖామందు వచ్చుచున్నాఁడు చనుమని చెప్పుటచే గూఢోక్తి. క్షేత్రపాలకుఁడు (నీవు క్రీడించుచున్న స్త్రీ భర్త యని గూఢోక్తి.)

వివృతోక్త్యలఙ్కారః 88

శ్లో॥ వివృతోక్తి, శ్లిష్టగుప్తం కవి నావిష్కృతం యది.
వృషాపేహి పరక్షేత్రా దితి వక్తి ససూచనమ్,

గీ॥ శ్లేషచే గుప్తమా దానిఁ జెలఁగఁ గృతులఁ
గవి బయల్పఱుప వివృతోక్తి విశదమగు
నితరుక్షేత్రమ్మునుండి యో వృషభరాజ!
తొలఁగు మీ! వేగ మనుచును బలికె హితుఁడు.

వివరణము:— శ్లేషచే గోపనము చేయఁబడిన గూఢార్థము, కవిచేఁ గంఠోక్తిగా వివరణము చేయఁబడినచో వివృతోక్తి. ఓ వృషభమా! పరక్షేత్రమును వేగ విడిచిపొమ్మని సఖున కొక్క చెలికాఁడు సూచనఁగాఁ జెప్పెను. ఇక్కడఁ బరక్షేత్రమును విడువుమను చోటఁగల శ్లేష గుప్తమయిన గూఢార్థము, సూచనఁగాఁ గవిచే వివరింపఁబడినట్లు వర్ణింపఁ బడినందున వివృతోక్త్యలంకారమయినది.

యుక్త్యలఙ్కారః 89

శ్లో॥ యుక్తిః పరాతిసంధానం క్రియయా మర్మగుప్తయే
త్వామాలిఖన్తీ దృష్ట్వాన్యాం ధనుః పౌష్పం కరేఽలిఖత్.

గీ॥ యుక్తియగు; మర్మగుప్త్యర్థ మొరుల వంచ
నమును గ్రియచేతఁ జేయఁగను మహిఁగృతుల
వ్రాయుచును నిన్ను వేఱొక్కపడఁతి రాఁగఁ
బుష్పధనువును గరమునఁ బోలఁతి వ్రాసె.

వివరణము:—ఉపపతి చిత్తరువును లిఖించుచుండఁగ నన్యయగు పడఁతి రాఁగఁ దనరహస్యము బయల్పడునని యెంచట్టన నా ప్రియుని హస్తమందుఁ బుష్పధనుస్సు నమర్చిన అంతమాత్రమున నా చిత్తరువు మన్మథుఁడుగా మాఱిన ఫలితార్థము.

లోకోక్త్యలఙ్కారః 90

శ్లో॥ లోకప్రవాదానుకృతి ర్లోకోక్తి రితికథ్యతే.
సహస్వ కతిచి న్మాసా న్మీలయిత్వా విలోచనే,

గీ॥ అవని లౌకిక సంభాషణానుకరణ
భాషణముల లోకోక్తిగాఁ బలుకుచుంద్రు
అక్షియుగళంబు మూసి మీనాక్షి! కొన్ని
నెలలు నీవు సహింపఁగా వలయు నెట్లొ?

వివరణము:—నాలుగురోజు లోపికఁ బట్టు మనెడి లోకవాడుకవలెను

ఛేకోక్త్యలఙ్కారః 91

శ్లో॥ ఛేకోక్తి ర్యత్ర లోకోక్తి స్స్యా దర్థాంతరగర్భితా.
భుజఙ్గఏవ జానీతే భుజఙ్గచరణం సఖే!

గీ॥ అనుదు రర్థాంతరము గర్భమునను గల్గి
నట్టి లోకోక్తి ఛేకోక్తియా నటంచు
సఖ ! భుజఙ్గపదములు భుజఙ్గములకె;
తెలియునంచు వచింత్రు విజ్ఞులగు కవులు.

వివరణము:—పాముకాళ్లు పామే యెఱుఁగునని పై దాని యభిప్రాయము (ఇది లోకోక్తి) ఇందర్థాంతరము గర్భితముగా నున్నది. భుజఙ్గశబ్దమునకు విటకాఁడని యర్థము. విటుని స్థానములు విటునికే తెలియు నను నర్థాంతరము గర్భమందున్నది.

వక్రోక్త్యలఙ్కారః 92

శ్లో॥ వక్రోక్తి శ్శ్లేషకాకుభ్యా మపరార్థ ప్రకల్పనమ్.
ముఞ్చ మానం దినం ప్రాప్తం నేహ నన్దీ హరాన్తికే,

గీ॥ కవులు కాకుస్వరముచేతఁ గాని, లేక
శ్లేషవాక్యాలనైనఁ గల్పితము సేయు
నెడల నన్యార్థమును, దానిఁ గృతులయందు
వ్రాసినారలు వక్రోక్తి వఱలునంచు.

గీ॥ కోప ముడుగుము వేకువ గూడవచ్చె
ననెడి భావ మేర్పడఁగను బాణవిభుఁడు
"ముఞ్చ మానం, దినం ప్రాప్త" మంచనంగ
"నేహ నన్దీ హరాన్తికే యాహి" యనియె.

వివరణము:—ముఞ్చ మానం, దినం ప్రాప్తం; అని భర్త వాక్యము అనఁగా తెల్లవారుచున్నది. కోపముడుగుపనఁగా, నన్ది నాయొద్దను లేఁడు. ఈశ్వరునికడ నున్నాఁడని

భార్య ప్రత్యుత్తర మొసంగెను. (ఆంధ్రీకరణము కుదరమిచే నిట్లుగ వ్రాయవలసి వచ్చినది.)

స్వభావోక్త్యలఙ్కారః 93

శ్లో॥ స్వభావోక్తి స్స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్
కురఙ్గై రుత్తరఙ్గాక్షైః స్తబ్ధకర్ణై రుదీక్షితమ్.

గీ॥ పరగుణక్రియా జాతిస్వభావములను
వ్యక్తపఱుపంగ నగు స్వభావోక్తి కృతుల
నిక్కఁబొడిచిన చెవులతోఁ జక్కలేళ్ళు
మిగులఁ జలియించు చూపుల నెగడుచుండె.

వివరణము:— ఇట లేఁడియొక్క జాతిస్వభావములు సొగసుగా వర్ణింపఁబడినవి గనుక స్వభావోక్త్యలంకారము.

భావికాలఙ్కారః 94

శ్లో॥ భావికం భూతభావ్యర్థ సాక్షాత్కారస్య వర్ణనమ్
అహం విలోకయేఽద్యాపి యుధ్యం తేఽత్రసురాసురాః.

గీ॥ కడచినవియు రానున్నవి గనులయెదుట
నగుచునున్నట్లు వర్ణింపనగును భావి
కంబు దేవదానవుల సంగ్రామ మిపుడు
జరుగుచున్నట్లు నాదృష్టి కరయఁబడెడి.

వివరణము:—పూర్వ మెన్నఁడో జరిగిన దేవదానవ యుద్ధ మిప్పుడు జరుగుచున్నట్లు వర్ణించుటచే భావికాలంకారము.

ఉదాత్తాలఙ్కారః 95

శ్లో॥ ఉదాత్త మృద్ధి శ్చరితం శ్లాఘ్యం వాన్యోపలక్షణమ్
సానో యతాభవ ద్యుద్ధం తద్ధూర్జటి కిరీటినోః

గీ॥ గొప్పవారల శ్లాఘ్యమౌ గుణచరిత్ర
వర్ణ్యమున కంగముగఁ జేసి పల్కినను; స
మృద్ధినిం గూర్చి కృతుల వర్ణించునెడల
ననిరి కవు,లుదాత్తాలంక్రియ యని కృతుల

గీ॥ గట్టు దొరముద్దు పట్టికిఁ గాంతుఁడైన
శ్రీసదాశివునకును గిరీటి కేధ
రాధరంబున ఘోర సంగ్రామమయ్యె?
నద్ది యీసానువై దనరారుచుండె.

వివరణము:—ఇట శ్లాఘ్యచరిత్రను; అన్యాంగముగా వర్ణించినారు. వర్ణ్యమగు నిందకీలాద్రిని వర్ణించుచుఁ దత్ప్రాశస్త్యమును జెప్పుటకై ధూర్జటి కిరీటులు యుద్ధముఁ జేసినచోటని శ్లాఘించినాఁడు.

గీ॥ మణిమయ స్తంభములయందుఁ దనరెడిప్రతి
బింబ సమితిచే వ్యాప్తమౌ వివిధ రావ
ణాసురులఁ గాంచి హనుమంతుఁ డంత గుఱుతు
దెలుసుకొనియెను శ్రమచేతఁ దివిరి తివిరి.

వివరణము:—రావణాసురుని సంపత్తును వర్ణించుట వలన సమృద్ధికి నుదాహరణము.

అత్యుక్త్యలఙ్కారః 96

శ్లో॥ అత్యుక్తి రద్భుతా తథ్య శౌర్యౌదార్యాది వర్ణనమ్
త్వయి దాతరి రాజేన్ద్ర యాచకాః కల్పశాఖినః.

గీ. శౌర్య మాదియగా వస్తు వసత్యముగను
నద్భుతముగను వర్ణింప నదియ యగు న
టందు రత్యుక్తి; నీదు నుదారగుణము
యాచకులఁ గల్పకంబుల నలవరించె.

వివరణము:—ఇచట రాజేంద్రుని దాన గుణముచే యాచకులు కల్పవృక్షము కాకున్నను; అయినట్లు వర్ణించుటచే నత్యుక్త్యలంకారము.

నిరుక్త్యలఙ్కారః 97

శ్లో॥ నిరుక్తి ర్యోగతో నామ్నా మన్యార్థత్వ ప్రకల్పనమ్
ఈదృశై శ్చరితై ర్జానే సత్యం దోషాకరో భవాన్.

గీ. అగు నవయ వార్థమున నన్య మర్థ మాఖ్య
లకుఁ బ్రకల్పింపఁగ నిరుక్త్యలంకృతి యగు
ఇట్టి చరితలచేత నిన్నెఱిఁగితిని; ని
జంబు దోషాకరుండవే; చంద్ర! నీవు.

వివరణము:— దోషాకరుఁడు రాత్రినిఁ జేయువాఁడు దోషాకరుఁడు దోషములకు స్థానమైనవాఁడు. చంద్రునిపేర్లలో నొకటియగు దోషాకరశబ్దమున కన్యార్థప్రకల్పనము (దోషముల కాకరుఁడని) చేయుటచే నిరుక్త్యలంకారము. నీ చరితలచేత నీవు దోషాకరుఁడవని తెలిసినది.

ప్రతిషేధాలఙ్కారః 98

శ్లో॥ ప్రతిషేధః ప్రసిద్ధస్య నిషేధస్యానువర్ణనమ్
న ద్యూత మేత త్కితవ క్రీడనం నిశితై శ్శరైః.

# స వ ర ప ణ త్ర ము

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 11 | లుప్తోమాష్టధా | లుప్తోపమాష్టధా |
| 6 | 8 | వర్ణేనా | వర్ణ్యేనా |
| 11 | 8 | రాణి | రాః |
| 14 | 4 | కాన్తాః | కాన్తః |
| | 9 | క్లైత | ఉక్లైత |
| | 23 | దలత్తైశ్రీ | ధలత్తై |
| 18 | 3 | టసంభవము | టయాసంభవము |
| | 13 | డుండుటను | డుండుట |
| | 16 | గోరుటయు బొందుటయు నసంభవము కావున నింక ఫలమసిద్ధము | గోరుటయసిద్ధము |
| | | 18, 19, 20, 21 పంక్తులు అనవసరము | |
| 23 | 23 | ప్రకృతములకుఁ గేవలా | ప్రకృతములకు కాని కేవలా |
| | 24 | ప్రకృతములకు | ప్రకృతములకు కాని |
| 24 | 9 | నపకృతములైన | నప్రకృతములైన |
| 25 | 5 | నీవు నేగురు | నీవులోకము |
| | 20 | నేనుగును రాజును | నేనుగునకు రాజునకును |
| 31 | 17 | మదమత్తస్య | మగమత్తస్య |
| 33 | 3 | ప్రస్తుతే | ప్రస్తుతేఽ |
| | 22 | మాతాపము | మిాతాపము |
| 35 | 21 | అహితసక్తిః | అహితాసక్తిః |
| | 15 | కరత్వమును) | కరత్వమును |
| | 16 | దనుట | దనుట) |
| 36 | 8 | ప్రకృతశ్లేష | స్వీయములు ప్రకృతశ్లేషఁ |
| | 12 | [illegible]సును— | పద్మములను నశింపజేయుః |
| 37 | 6 | ఘరుండు | ఘరంబు |
| | 7 | ప్రకృతవర్ణనము | ప్రకృతము |

| | | | |
|---|---|---|---|
| 49 | 8 | నీవు పర్వతములను, | నీవు, పర్వతములను |
| 49 | 9 | భూమిని, వరాహో | వరాహో |
| 52 | 5 | కోరినది | (కోరినది. |
| | 7 | సవరూలంకారము. | సమాలంకారము) |
| 53 | 3 | మయ్యును | మందును. |
| 55 | 11 | తోశక్య | తోఽశక్య |
| 56 | 21 | సాధకముగ | సాధనముగ |
| 57 | 15 | వాటికి | వానికి |
| 58 | 14 | బలెద్కరు | బల్కెదరు |
| 62 | 23 | మొనర్పుడు | మొనర్పుఁడు. |
| 63 | 9 | పొఱుచుగాంచు | పృష్ఠముగాంచు |
| | 12 | కాంచుటభ్రమయుట | భ్రమయుట |
| 64 | 10 | సౌకర్య | సౌకర్యం |
| | 24 | జైత్రచేతా | జైత్రనేతా |
| 66 | 9 | బద్బార్ధ | బదార్థ |
| 68 | 9 | క్షాహోతో | క్షాఽహోతా |
| 69 | 4 | హోన్య | హోఽన్య |
| 72 | 3 | తద్ధాటీ | త్వద్ధాటీ |
| 75 | 27 | క్రమికా | క్రమికం |
| 78 | 7 | అనురక్తమైన | (అనురక్తమైన |
| | 8 | గలది | గలది) |
| 79 | 17 | త్వమువ | మున |
| 80 | 7 | శితే నజానతే | శితేన, జానతే |
| | 24 | మహితం | సహితం |
| 82 | 2 | — | స్వీయోదాహరణము |
| 83 | 2 | వృత్తాంతమెఱిగిన | చేష్టలనెఱిఁగిన |
| 88 | 3 | మృద్ధి | మృద్ధే |

మహారాజ పోషకుల పేజీలో 7 వ పంక్తిలో కొర్లపాడు—కొర్లగూడెం
కృతిసమర్పణము పేజీ 7 వ పంక్తిలో శాస్త్రీ—శాస్త్రి.